# రంగూన్ రౌడీ

అను

# పతిభక్తి.

గ్రంథకర్త:

స్వరాజ్యరథము, సతీఅనసూయ, భీష్మబ్రహ్మచారి, గంగావతరణము, ధరణికోట,
మహాశక్తినిలయము, కాంకేళనము, తాజమహాల్,
ఇత్యాది బహునాటక కర్తయగు,

దేశముఖ - దేశపాండ్య - కీర్తిశేషులైన,

**సోమరాజు రామానుజరావుగారు.**



ప్రకాశకులు:

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.



మూడవకూర్పు 2000 ప్రతులు.



కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడియె.

కాపీరైటు రిజిష్టరు] 1935. [వెల రు 1—0—0.

## హెచ్చరిక.

ఈ నాటకమును ప్రదర్శింపఁ దలంచినవారు వ్రాతమూలకమైన అధికారపత్రమును పొందనిదే, ప్రదర్శింపరాదు. అట్లు అతిక్రమించినయెడల సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యు లగుదురు.

ఇట్లు,

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

# రెండవ కూర్పు విన్నపము.



ఈ నాటకము దైవానుగ్రహమున, ఆంధ్రనాటకరంగస్థలమునం గొంత ప్రచారముం గాంచెననుటకు మోద మందుచున్నాను. ఈముద్రణమునందు, తుదియంకమున, స్వల్పసంస్కారముం గావించితిని. ప్రదర్శనములందు సాధారణముగ నాందీపాయికి సంబంధించిన రంగములు విడువఁబడుచున్నను వానిని ముద్రణమునం దట్లే యుంచితిని. పంచమాంకమునందు ప్రథమరంగపు తుదిభాగమున, ప్రభావతికిని బట్టుకును కొంతభాగము ఈ కూర్పునందు తగ్గింపఁబడినది. ప్రథమ ముద్రణమున, అనుబంధములను గ్రంథాంతమునగాక, గ్రంథమధ్యముననే ముద్రించితిమి కాని, అది వీధినాటకముల పద్ధతి ననుకరించియున్న దనియును, కేవలము గ్రంథమును మాత్రమే చదువుకొను పాఠకులకు నడుమ నడుమ నీపాటలు, పఠనాభ్యంతరమును గల్గించుచున్న వనియుఁ గొందఱు రసజ్ఞులభిప్రాయము నొసంగుటచేత, అన్ని నాటకములరీతిగా ఈ కూర్పునందు, అనుబంధములను గ్రంథాంతముననే ముద్రింపవలసివచ్చెను. ప్రథమ ముద్రణమున విషాద శుభాంతరంగములను రెంటిని వేఱువేఱుగా ముద్రించితిమి. కాని శుభాంతరంగముయొక్క ప్రయోజన మంతగా కాన్పింపకుండుటచేత ఈ ముద్రణమున విషాదాంతముగ గ్రంథము పూర్తిచేయఁబడినది. ఈ ముద్రణమున సయితము ప్రథమ ముద్రణమునం దున్నన్ని కాకున్నను, కొన్నిముద్రణ స్ఖాలిత్యములు గలవు. పాఠకులు గమనించి సవరించికొందు రని ప్రార్థించుచున్నాను.

ఇట్లు, వినేయుఁడు,

సోమరాజు రామానుజరావు,
గ్రంథకర్త.

బెజవాడ,
28—11—32.

# ఇందలి పాత్రలు.

—: పురుషులు :—

1 శంకరరావు—(రంగూన్ రాడీ) కథానాయకుఁడు.
2 తులసీరావు—పోలీసుసూపరింటెండెంటు (కథానాయకుని మామ)
3 రమేశబాబు—రంగూను నందలి లక్షాధికారి.
4 గంగారాంసేటు—ఒక మార్వాడీ.
5 కృష్ణమూర్తి—జానకి ప్రియుఁడు.
6 జయరాం—రాధాబాయి ప్రియుఁడు.
7 మోహనరావు—కథానాయకుని కుమారుఁడు.
8 జడ్జి—అన్నపూర్ణకు ఉరిశిక్ష విధించిన అధికారి.
9 ఒకబట్లరు—విజయనగరముహోటలులోని నౌకరు.
10 సబిన్స్పెక్టరు—(కాకినాడలో)
11 సబిన్స్పెక్టరు—(విజయనగరములో)
12 జైల్ సూపరింటెండెంటు—(ఉరికంబమునొద్ద)
13 కిరాతుఁడు—(ఉరికంబమునొద్ద)
14 రంగారావు—పవర్ దారు.
15 సేవకుఁడు—(కాకినాడలో)

—: స్త్రీలు :—

1 అన్నపూర్ణ—కథానాయిక.
2 ప్రభావతి—రమేశుని భార్య.
3 గిరికుమారి—కాకినాడలోని వేశ్య.
4 రాధాబాయి—గంగారాముని కుమార్తె.
5 నాందీబాయి—గంగారాముని భార్య.
6 జానకి—కథానాయకుని చెల్లెలు.
7 తల్లి—కథానాయకుని తల్లి.
8 ఇంగ్లీషు దాసి—గంగారాముని దాసి.
9 లక్ష్మి—కథానాయిక దాసి.
10 దాసి—గిరికుమారి దాసి.

# తొలిపలుకు.

ఈ "రంగూన్‌రౌడీ" అను పతిభక్తినాటకము రంగూన్ ఆంధ్ర జాతీయ నాటకసభలో నేను పనిచేయుచుండినకాలమున్న 1929 వ సంవత్సరమున ఆ సభకై రచింపఁబడినది. ఈ నాటకము తొలుత ప్రదర్శింపఁబడినపుడు రంగూన్‌పురవాసులను చాల గంద్రగోళపెట్టినది. రౌడీలను దూషించుటకై ఉద్దేశింపఁబడి యీనాటకము రచింపఁబడె నని కొందఱు అభిప్రాయపడి నాటకప్రదర్శనమునకు పూర్వమే నా కనేక నిందాపూర్వకలేఖలను సంతకములు లేకుండ వ్రాసిరి. దౌర్జన్యమునకు పేరుపడిన రంగూనునందు పౌరులవలన సహాయమునకు శంకించి ప్రదర్శకులును నేనును గూడ నాటకదినమున రక్షకభటసహాయమునుసయితి మపేక్షింపవలసినవార మైతిమి. ప్రదర్శనమును గాంచుటకు కోపముచేత ప్రజలు రారేమో యని భీతిల్లితిమిగాని ఆ నాటక మెట్లుండునో చూతమను నుద్దేశముతో ఆ నాఁడు ప్రేక్షకులు ఇసుకవేసిన రాలనిచందమున నరుదెంచి హాలంతయు నిండిపోయిరి. నాటకప్రదర్శనము మొదలు ముగశమువఱకును ప్రేక్షకులు సంపూర్ణ ప్రమోదభరితమానసులై నాటకమును వీక్షించి, తొలుత మే మెంత భీతిల్లితిమో అంత కధికముగా భూషింపసాగిరి. ఈ నాటకమే రంగూన్ ఆంధ్రజాతీయ నాటకసభవారిచే గోదావరి, విశాఖపట్టణము, గంజాము జిల్లాలలో నంతటను పలుసార్లు ప్రదర్శింపఁబడి మంచి కీర్తిని గణించినది. సభవారికి సువర్ణపతకాదులు బహుమతిగా నొసంగఁబడెను.

ఈ నాటకమున శంకరరాయపాత్రను ధరించిన శ్రీయుత దొమ్మేటి సూర్యనారాయణగారి రౌడీనటనము నిజముగా చూచి తీరవలసినదే. ఇందు వీరరసమానమైన నటనమును గావించి గ్రంథమునకు సుస్థిరమైన సత్కీర్తిని గలిగించిరి. ఈ నాటకము రంగూనునందు గొప్పనటులసహాయముతో ప్రదర్శింపఁబడెను. ప్రసను విశ్రాంతికాలమున కాకినాడ లైట్‌హౌసును, సముద్రమును, స్టీమరును, శంకరరావును తిమింగిలము

మ్రింగుటయు, ప్రభావతీ రమేశుల నావషికారును, తిమింగిలమును జంపి శంకరరావును రక్షించుటయును,శబ్దరహితమగు కేవల నటనముతో బయస్కోపునవలె చూపఁబడెను. కేవలము సీనును చూచు నభిలాషతో ప్రేక్షకులు రెండుసారులు సీనునకు "వన్సుమోర్" నిచ్చిరి. ద్వితీయ విశ్రాంతికాలమున రెండు కొండలపై వంతెనయు, క్రింద ప్రవాహమును, ఆ వంతెనపైనుండి ప్రభావతీ శంకరరావులు నడిచిపోవుటయు, శంకరరావు వంతెనను విరుగగొట్టుటయు, తులసీరావు పోలీసులతో వచ్చి రెండవప్రక్కనుండి తుపాకులను ప్రేల్చుటయు, పోలీసు లొక్కరొక్కరుగా కొండపైనుండి క్రిందికి దొరలి కూలుటయు, తులసీరావును ప్రేల్చుటకు శంకరరావు తుపాకిలోని గుండ్లయిపోవుటయు నిశ్శబ్ద నటనారంగముగాఁ జూపఁబడెను. అట్టి గొప్పసీనులు ఆంధ్రదేశపుజిల్లాలలో ప్రదర్శింపఁ బడినపుడు చూపుటకే సభవారి కవకాశము కలుగకున్నను, కేవలము సూర్యనారాయణగారి శంకరరావునటనముతో ప్రేక్షకులను తృప్తి నందింపఁగలిగిరి. ఈ నాటకము నీతిదాయకమైన దని ప్రతివారును గ్రహింపకపోరు. ఇది విషాదాంతమగుటయే యుక్తమని నా తలంపు. విషాదాంతముగనే ప్రతిసభవారును ప్రదర్శించుచున్నారు. శుభాంతరంగము నీ రెండవ కూర్పునందు విడిచివేయడమైనది.

ఈ నాటకమునఁగల గుణములను పాఠకులు గ్రహించి దోషములను నాకుగాని ప్రకాశకులకుగాని యెఱింగించినయెడల తృతీయముద్రణమున తప్పక సవరించుకొందు నని రసజ్ఞపాఠకమహాశయులకు మనవి చేసికొనుచున్నాను.

ఇట్లు బుధజనవిధేయుఁడు,

సోమరాజు రామానుజరావు,

భద్రాచలము.

---

# రంగూన్ రౌడీ

అను

## పతిభక్తి.

---

ప్రథమాంకము.



రంగము- 1.

అన్నపూర్ణ మందిరము.

[అన్నపూర్ణయును, బాలునెత్తుకొని దాసీ లక్ష్మియు ప్రవేశము.]

అన్న— [అనుబంధము- 1.]

లక్ష్మి—అమ్మా! ఎందులకు విచారించెదవు? బాబుగారి నడత లోపము
తప్ప మీ కెట్టికొఱంతయైనఁ గలదా? లక్ష్మీసంపత్కర మగు
నీ సుందరమందిరములు, కంతుజయంతవసంతకేళీరంగము లనఁ
దగు నీయుద్యానవనములు, ధనదునినవనిధుల ధిక్కరించు ననంత
మైన భాగ్యసంపదయు, ఆపాదమస్తక మలంకరించుకొనినను
ఏడువారములకు సరిపోవు నెనలేని సువర్ణాభరణములును, రతీ
సతిని ధిక్కరించురూపసంపదయుఁ గలిగిన నీ కేల విచారము తల్లీ!

అన్న—ఓసి వెఱ్ఱిదానా! భారతమహిళల పరమధర్మ మేమో గుఱు
తింపక మాటలాడితివిగదా! ప్రపంచమున హైందవకాంత
వాంఛింపఁదగిన వివే యనుకొంటివా? పతి నిరాకరింప, పిశాచ
మువలె నొంటరినై, యీ దివ్యసౌధములలో సంచరించినంతమా
త్రమున, నా హృదయమునకు సౌఖ్యముగల్గు ననుకొంటివా?
భర్తృవిసర్జితనై, యీ మోడిశరీరముతో నీదివ్యవనవాటికలలోఁ

దిరిగినంతమాత్రమున నామదికిఁ బ్రమోదమగునని తలంచితివా ? అనాథనైన నా యాభరణసహస్ర మానందముం గూర్చు నని నమ్మితివా ? చూచి యానందింపవలసిన ప్రాణేశ్వరునికంటికి హేయమైపోయిన, యీదేహసౌందర్య మేల? కాల్పనా? లక్ష్మి! ఈ ప్రపంచమున నాకన్న నభాగినులెవ్వరైనఁ గలరా ?

లక్ష్మి—అమ్మా! కన్నీరు తుడుచుకొనుము. బాబుగారు మీయం దన్యబుద్ధిగలవారైనను, భగవత్ప్రసాదమున బంగారమువంటి పుత్రరత్నము కలిగినాఁడు.

అన్న—(బాలు నెత్తికొని ముద్దాడుచు) నాయనా! నాభాగ్యరాశీ! నీ వెట్టి దుష్టనక్షత్రమునఁ బ్రభవించితివిరా!

గీ. బాల! సుకుమార! నా గ్రహకాలమహిమ
వక్రగతినంద, నీఫాలభాగ్యరేఖ
యైన శుభపరిణామంబు నందరాదె ?
ధరణిపై భాగ్యహీను లిద్దఱము మనమె.

లక్ష్మి—(తెరవంకఁజూచి) అమ్మా! అమ్మా! బాబుగారు వచ్చుచున్నారు.

అన్న—(చూచి భయముతో) అమ్మయ్యో! త్రాగి వచ్చుచున్నట్లున్నారు. ఇది యేమిభయంకరాకారము! దైవమా! ఈ దిక్కుమాలిన మధుపానభూతమునకు, నానాథు నేల దాసునిఁ గావించితివి? దాసీ! కుఱ్ఱవాని నెత్తికొని లోని కరుగుము.

లక్ష్మి—నీయానతిప్రకారము—(బాలునితో నిష్క్రమించును.)

[త్రాగి తూలుచు శంకరరావు ప్రవేశించును.]

అన్న—(మేలిముసుగు సవరించుకొని ప్రక్కను నిలుచును.)

శంక—(చూచి) ఓహో! మా లేడీ (Lady) అన్నపూర్ణాదేవిగారు కాఁబోలును! హిందూస్త్రీలకు పుట్టు పెద్దరోగములలో నిది యొకటి. ముసుగుతగిలించుకొని మూఁడువంకలు తిరుగుట!

అన్న—(భర్తవంకకుఁ దిరిగి) నాథా! నిరంతరము మీ పాదపద్మపరిచర్య కర్తవ్యాంశాలనైన మీదాసి నగు నన్ను "అన్నపూర్ణాదేవిగా" రను పెద్దపేరునఁ బిలువ నేల?

శంక—ఏలనా? ఈదినముఁగూడ మేము త్రాగి వచ్చినందులకై మీరు దండింపకుండఁ జేసికొనుటకు.

అన్న—హరి హరీ! ఎందులకు నిందించెదరు? నే నెన్నఁడైన మిమ్ము పల్లెత్తుమాటాడి యెఱుఁగుదునా? మీరు ప్రభువులు, నేను దాసిని. మిమ్ము దండించుటకు నా కధికారము గలదా?

శంక—అధికారము లేదని అణఁగియుంటివిగాని, తాఖతుగలిగినచో దండింతువు కాఁబోలు నేమి?

అన్న—నాథా! వచ్చినదే తడవుగ నన్నిట్లు వాయఁ దిట్టుటకు నే నేమి యపరాధము చేసితిని?

సీ. పతికన్న వేరుగా పరదైవతము నాకుఁ
గలుగఁబోవఁ డటంచుఁ దలఁచుకొంటి,
నాథునిపదపూజనంబె నా కిహపరో
త్తరణమౌ గతిగాఁగ నరసికొంటి,
ఈ యనాథకు హృదయేశ్వరముఖదర్శ
నమె ప్రమోదం బని నమ్మికొంటి,
ఎట్టికష్టము లావహిల్లిన మీయండ
వీడని ధైర్యంబుతోడ నుంటి,
నిష్కళంక మైన నిర్మలభక్తితో
సతము మిమ్ము పూజ సల్పుచుంటి,
నట్టి పాదదాసి నగు నన్ను నిష్ఠుర
భాషలాడ నాకుపాప మేమి?

శంక—హా హాహాహాహా! వెఱ్ఱిదానా! అన్నపూర్ణా! ఈమాత్రమునకే దుఃఖించుచుంటివా? ఊరక పరిహాసమునకై నిన్ని ట్లంటిని గాని,

యిది నిజ మనుకొనకు. మేము నేఁడు చాల సంతోషముతో నున్నాము. ఆసంతోషమున మాదేవిగారివైన నీతో పరిహాసము లాడితిమి. సరేగాని-మాసంతోషమునకుఁ గారణమేమో యెఱుఁగఁ దలంచితివా ?

అన్న—నాథా! అదియెట్టిదో సెలవిండు. ఆకర్ణించి యానంద మందెదను.

శంక—ముసలిముండకొడుకు మూట ముల్లె కట్టి పైకి వేంచేసినాఁడు. అదే మా కానందము !

అన్న—ముసలిముండకొడు కెవ్వరు ? మామగారా యేమి ?

శంక—మరియిం కెవ్వ రనుకొంటివి ? చావకుండ బ్రతుకకుండ నెన్ని నాళ్లు మంచమునఁబడి యేడిపించినాఁడు. హహ్హహహ్హహహ్హ.

అన్న—(దుఃఖముతో) శ్రీరామచంద్ర ! ఎట్టిఘోరవార్తవింటిని ?

ఆ. ఇంట నేను పాద మిడినంత నుండి న
 న్నన్నబిడ్డవోలె కరుణఁ జూచె;
 నట్టి సదయహృదయుఁ డగుమామగారి దు
 ర్మరణవార్త పిడుగుమాడ్కిఁ దోఁచె.

శంక—(అసహ్యముతో) ఛీఛీ! జ్ఞానహీనురాలవు. నీ దుస్స్వభావమే యిది. అందులకే నిన్ను నేను నిందించుచుందును. ఆఱులక్షల రూపాయిలు, యాఱువందల యెకరముల మాగాణి, ఆనందకరములైన యుద్యానవనములు, అత్యున్నతములైన సౌధములు ! వహ్వా ! అనాయాసముగా లభించె నని నే నానందపడుచుండఁగా నీకు విచారమా ? ముసలిముండకొడుకు చచ్చిననేమి ? పుచ్చిననేమి ?

అన్న—అయ్యయ్యో ! ప్రాణేశ్వరా ! గృహాధికారి—వృద్ధుఁడు—మహావిజ్ఞానశీలుఁడు — ఒక్కచేతిమీఁదుగా ఇంత ధనమును సమార్జించిన యైశ్వర్యవంతుఁడు—మరణింపఁగా ఆయనగర్భ

నాసమున జన్మించిన కుమారులైన మీరు లోకముకొఱకైనను రవంత దుఃఖమునైన సూచింపవలసిన విధాయకముగాదా! వృద్ధులైన మామగారు శాశ్వత బ్రహ్మకల్పముగా జీవించియుందురా? ఎన్నఁడో యొకనాఁడు మరణింపవలసినవారే కదా! వారి యనంతరమున నీయైశ్వర్యముల కధికారులు మీరే కదా! ఇంతలో మీరిట్లు వెలితిపడుటను జూచి లోకు లన్యథా తలంపరా?

శంక—ఛీ! ఇట్టి మనోవ్యాకులప్రద మగు ప్రసంగమును వినలేకయే నేను కొంపకుఁ గూడ వచ్చుట మానివేసితిని. మఱల నీదిక్కుమాలిన యుపన్యాసముల నారంభించితివి. గిరికుమారి యెన్నఁడైన నిట్లు మాటాడియెఱుంగునా? దానికిఁగల జ్ఞానము నీకేల లేకు పశువా!

అన్న—నాథా! పశుప్రవృత్తిగల గిరికుమారిని సంసారి నగు నాతోఁ బోల్పఁదగునా? మీతో నిట్టిప్రసంగ మొనరించుటకు మీ మంచిచెడలతో దాని కేమి యవసరము? ఎట్లైన మీ మనస్సు రంజింపఁజేసి ధనార్జనచేయుటయేకదా దానివృత్తిధర్మము! గిరికుమారి మీవలన నిప్పటికి లక్షాధికారిణి యైనదిగాదా?

శంక—ఛీ! నోరు కట్టిపెట్టు. న న్నేమైనననందువుగాక! దానిని మాత్రము దూషించినయెడల నే నోర్చువాఁడను గాను. దానియైశ్వర్యములం జూచి నీకింత కడుపుమంట యెందులకు? నీవుగాని— నీయబ్బ, మరి యెవ్వఁడైన, గాని—దానిని లక్షాధికారిణినిగాఁ జేసినారా?

అన్న—రామరామ! దాని నేమని దూషించితిని? తమయర్థాంగి నగు నా కీమాత్రపు సంభాషణమునకైన నధికారములేదా?

శంక—లేకేమి! సర్వాధికారములును నీవేకదా! గిరికుమారి యెవ్వతె - పడుపుముండ? దానికొంపకే పోవుదును లే? నీ యధికారములతో నీ విందే యుండుము. (పోఁబోవును.)

అన్న—నాథా! నాథా! ఒక్కనిమిషము తాళుఁడు. మైలస్నాన మైనఁ జేసిపోఁదు.

శంక—ఒక్కక్షణ మాఁగను! (అనుబంధము-2.)

(త్రోసివైచి నిష్క్రమించును.)

(తెరవ్రాలును.)

---

రంగము 2.

స్థలము:—గంగారాముని గృహము.

[రాధాబాయి ప్రవేశించును.]

రాధా—(అనుబంధము - 3.)

నాతండ్రియగు గంగారామునకు ధనముపై ప్రేమ. మా అమ్మ యైన నాందీబాయికి అధికారముపై ప్రేమ. నామట్టునకు నాకు వలపుగానిపై ప్రేమ. ఆహాహా! ఆజయరాముఁ డెంత అందమైనవాఁడు! (చేతిగడియారము చూచి) ఐదుగంట లైనది. వచ్చెదనని చెప్పినవేళ యైనది! ఏమిచెప్పుమా ఇంకను రాకున్నాఁడు? అదిగో బయుట చప్పుడు. తప్పక జయరామ సింగే వచ్చియుండును. (తలుపుతెరచును.)

[చేతిలో నొక పుస్తకముతో జయరాం ప్రవేశము.]

జయ—వెల్ - మైడియర్ యంప్రస్! గు డీవినింగ్.

రాధా—అన్నమాట తప్పకుండ అనుకొన్న వేళకు సత్యహరిశ్చంద్రుని వలె సరిగా వచ్చినారే!

జయ—అన్నమాట యేమి? నామాటయే తప్పలేదు. నా కన్నలు గాని, తమ్ములుగాని లేనే లేరు.

రాధా—చాలులెండి! కవీశ్వరు లైనందుకు కడుచమత్కారముగా మాటలాడుచున్నారే!

జయ—ఆకవిత్వమంతయు నాబుఱ్ఱలో లేదు. నీమొగములో నున్నది. నీమొగము చూడగనే నా కీకవిత్వము పుట్టుచుండును.

(అనుబంధము - 4.)

[గంగారాం సేట్ ప్రవేశము.]

గంగా—(చూచి అసహ్యపడి) అరే బాప్ రే బాప్- ఛీకిడీకాప్యార్ ఘర్ కాలాచార్ - ఈజయరాం ముండకొడుకు ఇన్నాళ్ళకు నాచేతఁబడినాఁడు. చేతఁబడ్డ వీనిని చెప్పుదెబ్బలతోఁగాని సాగ నంపను. కానీ, వీనిసరసము నీచాటునుండి కనిపెట్టెదను.

(చాటుననుండును.)

రాధా—ప్రియా ! మీచేతియందలి గ్రంథ మేమి ?

జయ—ఇదియా ! ఇది యొక నాటకము.

రాధా—మీరు వ్రాసినదేనా ?

జయ—మఱియొకరు వ్రాసినదానిని మాగ్రంథ మని చెప్పుకొనుటకు మాయచేసి బ్రతుకు మైరావణ కవి ననుకొంటివా యేమి ?

గంగా—గతిలేక వీఁ డీపడుమ కవిత్వముకూడ నేర్చినాఁడా? సరి. అట్ల యిన పద్యలక్షణమును నేర్పినగురువునకు పంగనామములు పెట్టినాఁ డన్నమాటే.

రాధా—అట్లయిన నీగ్రంథము పేరేమి ?

జయ—గంగారామసంహారము !

గంగ—(ఉలికిపడి) ఏమీ ! నాసంహారమా ?

రాధా—ఇది యేమి ! నాతండ్రిని సంహరించు నాటకమా ?

జయ—ఔను ! నీతండ్రినే.

రాధా—అయ్యో ! అంతదారుణము చేయుదురా ?

జయ—వెఱ్ఱిదానా! గ్రంథనామము విన్నంతనే గాభరా పడెద వేమి ? ఇది పట్టికథమాత్రమేకదా ? అంతమాత్రముననే భయమేల ?

రాధా—అంతేకదా ! నిజముగ చంపరు గదా ?

జయ—చంపినమాత్ర మేమి? నీతండ్రి చచ్చినయెడల నిలువచేసిన ధన మంతయు మనకే దక్కును.

గంగా—ఓరి నీపొట్టపొడిచివేయ? నీ కెంత దుర్బుద్ధి పుట్టెనురా ? గంగారాంసేటును నీవటరా చంపువాఁడవు? ఉండుండు. నీకు చెప్పు దెబ్బలు కావలసియున్నవి.

రాధా—మీ రిట్టిమాట లాడినచో నిక్కడ నిలువవద్దు. వెడలిపొండు.

జయ—కాదు కాదు. ప్రియురాలా ! ఊరక పరిహాసమున కట్లంటిని. ఇది నిజమేనా ?

రాధా—ఇంతేకద !

జయ—మఱి ఇంకెంత? సరేగాని నాగ్రంథములోని గంగారామసంహారమును నటించి చూపనా ?

రాధా—మీరు నటకులుకూడనా యేమి ?

జయ—నీ కింకను తెలియదా ? ఛాలెంజిగా యాక్టుచేసినవాఁడను.

రాధా—సరే. మీనటనమును చూపుఁడు.

జయ—ఎస్. నౌ అయాం దీ సెకండ్ హ్యాన్డ్ ఒథెల్లో.

గంగా—సెకండుహాన్డ్ సిగరెట్టువలె వీఁడు సెకన్డ్ హాన్డ్ ఒథెల్లోయఁట.

జయ— బ్యాండు ట్యూన్—ఆదితాళం.

హహహహహహా - అయ్యాం సెకండ్ ఒథెల్లో॥ హా॥
హాహాహాహాహా
లుక్ఎట్ - లుక్ఎట్ - మై గ్యాలెంట్
వెరివెల్ - వెరివెల్ - మైట్యాలెంట్॥ హా॥
అయ్యాం ఆథర్ - అయ్యాం ఆక్టర్ - ఎవ్విరథింగ్ అయ్యాం
యూ ఆల్కం అండ్ - ఫీక్ మీ అప్-ఇన్ దిస్ గ్యాలో నైట్॥ హా॥

జయ—నౌ కమాన్ ! ది సీజ్ మై రోబ్ !

గంగా—(చెప్పుతీసి) నౌ కమాన్ ! ది సీజ్ మై బూట్.

జయ—(కోటుతీసిపైచి ఉత్తరీయమును రోబ్ వలె కట్టుకొనును) నౌ కమాన్ ది సీజ్ మై సోర్డ్ హూప్. (పెన్సిలుతీసి వెంట్రుకనుకోసి) హాహాహాహా. నౌ అయాం దీ సెకెన్డు హ్యాన్డ్ ఒథెల్లో - నౌ కమార్ నికాలో ఫుట్ లైట్-హూప్- (దీపము లారిపోవును.) నౌ బతావ్ ఫోకస్ (ఫోకస్ చూపఁబడును.) హాహాహాహా ! నౌ-అయాం దీ సెకన్డు హ్యాన్డ్ ఒథెల్లో-(తనకోటును నేలపై మనుష్యాకృతిని పరచి) నౌ ది సీజ్ యువర్ ఫాదర్ గంగారాం సేట్. అయాం, నౌ, రెడీ, ఖూనీ, కర్నే కేలియే. (కత్తిసాము నటించి తుదకు సలాంచేయును.)

రాధా—వహ్వా ! వహ్వా ! (చప్పట్లుకొట్టును.)

గంగా—(ఆక్షేపణగా) వహ్వా ! వహ్వా ! ఈశూరుఁడు నన్ను ఖూనీ చేయుట, ఈవిడ మెచ్చుకొనుట. వహ్వా ! వహ్వా !

జయ—ఆల్ రైట్- ది సీజ్ ది మర్డర్ సీన్ ఆఫ్ యువర్ ఫాదర్ గంగా రాం సేట్. (క్రిందనున్నకోటును పొడిచి దానిపైఁబడి దొర లుచు, కోటును తనశరీరమునకు చుట్టుకొని కూర్చుండును.)

రాధా—వహ్వా ! వహ్వా ! (చప్పట్లుకొట్టును.)

గంగా—(బయటకువచ్చి) వహ్వా! వహ్వా! ది సీజ్ ది మర్డర్ ఆఫ్ గంగా రాం సేట్ ! అరే ఉల్లూకాబేటా ! (చెవిపట్టుకొని) ఇల్లాంటి వెఱ్ఱిసరసాలు యేమవకుండా ఇప్పటికి చెప్పుదెబ్బలతో సరి పెడతాను. ఈసారి నాకొంపలో కాలుపెడితే ఈఖూనీ నీకు జరుగుతుం దనుకో.

(అనుబంధము-౫.)

(చెప్పుదెబ్బలు కొట్టును. అందఱు నిష్క్రమింతురు.)

(తెరవ్రాలును.)

## రంగము- 3.

(శంకరరావు గిరికుమారి త్రాగుచుందురు.)

శంక—చూచితివా ! నా దెబ్బ !

సీ. తండ్రి చచ్చినతోనె తఱగని యైశ్వర్య
మ్ముల కధికారినై నిలిచినాను
శ్రీరంగనీతులు చెప్పవచ్చిన కుల
దార నీడిచి కాలఁ దన్నినాను
భరణంబు నిమ్మని పలుమారు కబురంపి
నట్టి తల్లికి సున్న చుట్టినాను
బ్యాంకిరోడ్డున నున్న భవనంబు నెనిమిది
వేలకు తాకట్టు పెట్టినాను
మితి నెఱుంగని విందులు మిత్రతతికిఁ
జేసితిని మఱి యెన్నెని చేయఁగలను;
వసుధలోపల నావంటిభాగ్యశాలి
యరసి చూచిన దొరుకునే గిరికుమారి !

నాప్రేమను బడయంజాలిన నీ భాగ్యమే భాగ్యముసుమా ! నా సర్వ సంపదలకు నీవే సర్వాధికారిణివి. కావున నేనేకాక-నామిత్రు లందఱును నీ మృదుపాదములచెంతదాసానుదాసులై నిలువవలసినవారే !

గిరి—ప్రియా ! ఇది యంతయు మీకటాక్షము ! కాని భార్యను నిరాకరించి వచ్చితి ననుచున్నారు. నాయైశ్వర్యమును జూచి యోర్వలేక, మాయలమారియైన మీభార్య న న్నేమిచేయునో యని భయపడుచున్నాను.

శంక—ఛీ ! ఛీ ! ఎంత వెఱ్ఱియాలోచన చేసితివి ? నా వంటివాఁడు నీకుఁ బ్రియుఁడై యుండఁగా అన్నపూర్ణ ని న్నేమో చేయఁ గల దని హడలిపోవుచుంటివా? అన్నపూర్ణ మొగమైన నింకఁ

జూతునా! ప్రాతచెప్పుతో సమానముగ వదలియే వేసితినిగదా! ఇంక దాని ప్రసక్తి యేమున్నది? కూడులేకున్న గుమ్మమున కింత కబళముగా భిక్ష మెత్తుకొని తిరిగిననైన సమ్మతింతునుగాని, కూటికై దాని కొక్క గ్రుడ్డిగవ్వయైనబంపుదునా ?

గిరి—వట్టిమాటలు చెప్పినంతనే అవి వాస్తవమునకు రావలయునుగదా! కాళ్ళపైఁబడి వేడుకున్నంతనే మీామనస్సు కరుగకుండునా?

శంక—ఆ! ఏమంటివి! నే నంత దుర్బలహృదయుఁడననియేనా నీ యభిప్రాయము? నాముదుసలితల్లి తనకు భరణమైన నీయవలసిన దని నాల్గుకబురు లంపినను నామనస్సు కఱగిన దనుకొంటివా? చీటిఁ దెచ్చినవానిని, చీటికిమాటికి కబురులు మోయ వద్దని చెంపదెబ్బలతోఁ గూడ సాగనంపితిని. ఏమనుకొంటివో ?

గిరి—సేబాస్! ఇప్పుడు నామనస్సునకు నచ్చినది! కాని పడుచుభార్యను నిరాకరించుట, ముసలితల్లిని నిరాకరించుటవంటిదికాదేమో యని కొంచె మనుమానము పీడించుచున్నది.

శంక—హాహా హాహాహా! ఈదినమున నీకనుమానములు పెనుభూతములగుచున్నవి. లోపలికి బ్రాందిచుక్క అధికముగా పడనిలోపమేమో యిది యని, నాకుఁ దోఁచు చున్నది. కొంచెము గొంతు తడిచేసికో! (సారాయి గ్లాసులోపోసి)

(అనుబంధము- 6.)

(ఇచ్చును.)

గిరి—(త్రాగి) మీారన్నట్లు ధైర్యము గల్గించుటలో—దారూకన్న నెక్కువశక్తిగలవస్తువు కనఁబడదు.

శంక—(వీపుపైఁ దట్టి) సెబాస్! ఇప్పుడు నీకు సారాయిసామర్థ్యము చక్కఁగా దెలియుచున్నది.

[శంకరరావుతల్లియు, జానకియు ప్రవేశము.]

జాన—అన్నా! అమ్మకు భరణమీయ నని పలికి చీటీతెచ్చినవానిని చెంపదెబ్బలు కొట్టితివఁట! ఇది యేమియన్యాయము? కన్నతల్లికి కన్నీరుగార్పించుట ఘనమని తోఁచినదా నీకు? ఎవరైన విన్న నే మందురు? మనవంశపుకీర్తి యంతయు నేఁటితో మంటఁగ లపఁదలంచితివా? అన్నా! ఇదివర కేమిచేసినఁ జేసితివిగాక! ఇఁకనైన, మన తల్లి నాదరింపుము. కుమారుఁడవై ననీవు నిరా కరించినయెడల నామెకు దిక్కెవరు?

శంక—ఓహో! ఇట్టినీతుల నుపదేశింపుమని నీవదినె యేమైన బోధించి పంపించినదా నీకు? ఓసీ తెలివిమాలినదానా? ముసలిదాని మాట యట్లుంచుము. నీకును నీవదినెకును మాత్రము దిక్కె వ్వ రనుకొంటివి. మి మ్మందఱను మాత్రము నేను పోషింతు ననుకొంటివా?

తల్లి—(కోపముతో) ఓరీ! యౌవనమదాంధుఁడా! జ్ఞానహీనుఁడా! నీవు మ మ్మందఱ నేల పోషింతువురా? ఈసంపద యంతయు నెవ్వరి దనుకొంటివిరా? భ్రష్టుఁడా! పాపాత్ముఁడా! కన్నతల్లి కడుపుకాల్చిన నీవు గతిలేక పురుగులుపడి చావ వఁటరా! తుదకు నినీ్నమిత్రులును, వేశ్యలును, త్రాగుడును, రక్షించు నఁటరా! ఎంతగా కన్నులు మూసికొని సంచరించుచుంటివిరా? కులనాశకా! మాతృద్రోహీ! చండాలుఁడా!

శంక—(పండ్లుకొఱకుచు) ఓసీ! ముసలిబానిసతొత్తా! ఏమని పేలు చుంటివే! చావసిద్ధమైనదానవని- తల్లిముండవని- నిన్ను దయ దలఁచితిని గాని, లేనిచో—(పిడికిలి చూపును.)

జాన—అమ్మా! ఎందుల కీకోపము? ఊరకుండుము—అన్నా! అమ్మ కు పెద్దతనము వచ్చినది. మతి మొదలే లేదు. అట్టిదానిమీఁద

నీ వాగ్రహము చూపిన లాభములేదు. ఆఱునెలలు సాముచేసి మూలనున్న ముసలిముండను పొడిచెనన్నట్లు నీప్రతాపమంత యుఁ జూపుట కీమెయా దొఱికినది! చేరదీసిన వేశ్యముందర నా చిందులు ద్రొక్కెదవు. ఇది నీ కొకఘనము కాదు. నామను వది నెకును కూడుపెట్టకున్న మానె. గుమ్మమున కొక కబళము భిక్షు మెత్తుకొనియో, సజ్జనులగువారి యెవరియింటనైన చాకిరి చేసికొనియో బ్రదుకఁగలము. పెద్దవాఁడై చేతి కందినపిదప నీ కుమారుఁడే తల్లికి దిక్కగును. కాని జవసత్త్వములు లేక చావసిద్ధముగానున్న యీముదుసలిదానికి మాత్రము దిక్కు చూపుము. ఈమెను పోషించుట నీవుకాల్చుచున్న సిగరెట్లు మాత్రపు విలువమైనఁ గాఁజాలదు. లోకనింద నేల తలకు చుట్టుకొందువు? సోదరా! నామనవి వినుము.

గిరి—చూడండి! న న్నెన్నిమాట లాడుచున్నారో! నే నీదుర్భాషలను వినలేను. లోనికి పోవుదును. (పోఁబోవును.)

శంక—ఆఁ! ఆఁ! వలదు; వలదు. నీకు గోపమువచ్చిన నేను బ్రదుకఁ గలనా? ని న్నెవ్వ రేమనఁగలరు? నిలువుము.

తల్లి—ఎంత వగలమారి వంకాయవే- గయ్యాళిగంపా!

జాన—అమ్మా! నీ కేమి మతి పోయినదా! మనగ్రహచారమున కేడ్వవలసినదేగాని ఒకరి ననఁదగినయధికారము మన కెక్కడిది? మనబంగారము మంచిదైన కంసాలి యేమిచేయఁగలఁడు!

శంక—అమ్మాయీ! విశేషముగ మీరందఱును నాతో వాదించిన కొలఁదియు నాశరీరము మండుకొనిపోవుచున్నది. తుదిమాట చెప్పెదను. నా నిశ్చయమును విని మీ రిటనుండి వెడలిపొండు.

ఆ. తల్లి లేదు నాకు; చెల్లెలు లే దింక;
  భార్య లేదు; పుత్రవరుఁడు లేఁడు;

సర్వమునకు నాకు సానియు బ్రాందియే
గతి యటంచు నెఱిఁగి కదలిపొండు.

జాన—హా! పరమేశ్వరా! ఎట్టి సజ్జనునినోటినుండి యెట్టి దుర్భ్రష్టలా పంబు లాడించుచున్నావు!

తల్లి—హా! దైవమా! చావసిద్ధముగానున్న నా కేమిగతి చూపితివి? పరలోకమం దున్న ప్రాణేశ్వరా! మీ కుమారుఁడు నాకు పిడికెడుకూడైన లేకుండఁజేసినాఁడు. ఈదురవస్థ ననుభవింప కుండ చల్లగాఁ బరలోకమున కేగిన మీరే ధన్యులు. నాకు సుమంగిలినై చచ్చు యోగ్యత కలుగకపోయెను. ఎంత మహైశ్వర్యముతోఁ దులఁదూగితినో యంత కంత హీనస్థితి నా కిప్పుడు కలిగినది. బిడ్డా! జానకీ! ఇంక నే నీహీనపుబ్రతుకు బ్రతుకలేను. నా కేదైన నింత విషముపెట్టి చంపుము. లేదా! న న్నేనడిసముద్రముననైన బండగట్టి బలవంతముగఁ ద్రోసి వేయుము.

జాన—అంత పనిచేయుటకు నీముద్దులకొడుకు సిద్ధముగనే యున్నాఁడు నా కెందుల కీపాపఫలము?

తల్లి—నాయనా! శంకరా! ఇట్లు కష్టపెట్టి చంపియు చావనీకుండఁ జేయుటకన్న నీతుపాకితో నొక్కమాటు నాముసలిగుండెలలో ప్రేల్చి చంపలేవా? ఇందులకైన నీకుఁ గరుణరాదా?

జాన—అన్నా! అమ్మశోకము నీకు వినఁబడుటలేదా? చెడత్రాఁగి, "తల్లిలేదు, చెల్లెలులేదు, భార్యలేదు, కొడుకులేడు; నాకు సర్వమునకు సారాయియును సానియే" యని యొడలెఱుఁగక ప్రేలెదవా? ఎంత బుద్ధిహీనుఁడవైతివి? ఇది నీకు శ్రేయస్సు కాదుసుమా? మాతృశాపము మంటఁబెట్టునుగాని వదలదు సుమా! ఏకష్టములోపడి నీపేరు చెప్పుకొనుచు భిక్షమెత్తియైన

నీముసలిదానిని పోషింపలేకపోము. కాని ముందు నీగతిచూచు
కొనుము. ఈయైశ్వర్యము నీకు శాశ్వతముగాదు. కన్నులు తెఱ
చుకొనుము. సజ్జనులదారినినడువుము. కులమునకప్రతిష్ఠ తేకుము.

శంక—(కోపముతో) హ హ్హా హ్హా హ్హా ! ఓ నే జానకీ! ముసలిదా
నిని పోషించుటకు మీాకు భిక్షమెత్తవలసిన పనియేమి ? నీవును
నీ వదినెయు మంచి పదుమూఁడవయులో నున్నారు; సానివృత్తిచే
నైన సంపాదింపఁగలరు.

జాన—(కోపముతో) ఓరీ! చండాలుఁడా ! మహాపతివ్రతయైన వదినెగా
రిని, లోకజ్ఞానము నెఱుఁగని నన్నును సానివృత్తి చేయుమని దూ
షింపుచుంటివా ? నీ నాలుక చీలికలుగాను ! కులభ్రష్టుఁడా !
త్రాగుఁబోతా ! నీ వెట్టి ఘోరనరకమునఁ బడిపోవుదువోకదా !
వాపాత్ముఁడా ! నీకాల మీాక నెన్నఁడు సమీాపించునురా ?

(అనుబంధము - 7.)

[రంగారావు ప్రవేశము.]

రంగా—అమ్మాయీ ! వీనికి నేను గట్టిగా బుద్ధిచెప్పెదను. నీవు తల్లి
గారిని దీసికొని ఇంటికిఁ బొమ్ము. వీనికిఁ గన్నులిప్పుడు నెత్తికి
వచ్చియున్నవి. సరిజేసినఁగాని జ్ఞానము రాదు.

జాన—తాతగారూ ! తమయాజ్ఞాప్రకారము చేయుదును. అమ్మా !
ఈదరిద్రుఁ డిప్పుడు త్రాగి యొడలు తెలియకున్నాఁడు. వీనితో
మనకు వివాదమేల ? రమ్ము ! అన్నిఁటికిని తాతగారున్నారు.

(తల్లినిదీసికొని నిష్క్రమించును.)

శంక—ఓసీ ! భ్రష్టురాలా ! దరిద్రుఁడ నఁటే నేను ? దరిద్రము నాకో
మీాకో యిఁక తెలియఁజేసెదనులే. హాహ్హాహ్హాహ్హా! (త్రాగును.)

రంగా—ఓరీ ! కుట్టకుంకా ! నా లేల దరిద్రు లయ్యెదమురా ?

శంక—కూటికి గతిలేక.

రంకా——వారికి కూటికి గతిలేని కర్మమేమి ?

శంక——కర్మమా ! కర్మమే ! పోషించుదిక్కు లేక.

రంగా——వారికి దిక్కు లే కేమిరా ! జ్ఞానహీనుఁడా ! మగఁడును తండ్రియును సంపాదించిన ద్రవ్యమునకు వారి కధికారములేదా?

శంక——ముసలిపీనుగా ! మర్యాద నెఱిఁగి మాటాడుము. దూషించితివా తల చిదుకఁగొట్టఁగలను. శంకరరావు నే మనుకొంటివో? నీవు సేవకుఁడవు. నేను ప్రభువును. జాగ్రత్త !

రంగా——(చెవిపట్టుకొని) అరే బేటా ! నాకండ్లయెదుట పుట్టి పెరిగిన శుంఠవు ! నేఁటి కెంతవాఁడవైతివిరా ? ఇప్పుడు నీవుగావు ప్రభుఁడవు- నేను. నీతల్లికి, చెల్లెలికి, భార్యకు, నీకు తిండి పడ వేయవలసినవాఁడను నేను. నీవుకావు తెలిసినదా ?

శంక——ఆఁ ! ఆఁ ! ఒడలు తెలిసికొని మాటలాఁడు.

రంగా——ఆఁ ! ఒడలు తెలియదు. త్రాగి......కన్నులువిప్పి యిటు చూఁడు. ప్రాణములు విడుచునప్పుడు నీతండ్రి నాకు వ్రాసి యిచ్చిన పవరునామా తెలిసికొంటివా ? ఇది సర్కారుస్టాంపు కాగితము. నట్టిది కాదు. బ్రిటిషుబాపుటా, నీవు చచ్చిన చావ వలసినదేకాని, నా కీ యధికారము తప్పదు. ముండనువలె మూలఁ గూర్చుండఁబెట్టి నీకు నెల కైదువందలచొప్పున నేను భరణమిచ్చెదను. బ్రతుకు తెరువు చూచుకో !

గిరి——నడుమ నా కీశని యెక్కడ దాపురించెను ?

రంగా——(బుగ్గపై పొడిచి) ఓసీ ఛటకారీ ! నేను శనివలె నీకన్నులకుఁ గనఁబడుచుంటినా ? శంకరరావుడబ్బు చౌకగా నున్నదని వాని కొంప వల్లకాటఁ గలుపవచ్చిన శనివి నీవు కావా ? త్రాగి తందనములాడుచు......ఛీ !——ఓసీ సేవకా !

సేవ——అయ్యా ! ఏమిసెలవు ?

రంగా—ఈశనిగొట్టుముండను సరిహద్దులలో నుండకుండ సాగనంపు మావలకు.

సేవ—ఓసీ! నడిచెదవా? గెంటుదునా?

గిరి—ప్రియా! ప్రియా! (ఏడ్చును.)

శంక—ఓరీ! సేవకా! దానిని తాకితివా చూడు!

రంగా—(శంకరరావును చెంపపైఁ గొట్టి) అరే ఉల్లూ! నోరుమూసి కొని చచ్చిన ట్లుండు. సేవకా! నీపని గానిమ్ము.

సేవ—(గిరికుమారిని గెంటుకొనిపోవును.)

శంక—ఓరీ! ముసలీ! నన్ను చెంపదెబ్బ కొట్టితివిగా! ఇది మఱచి పోకు. గుండెలలో నుంచుకొనుము.

రంగా—నిషా దిగినదా? మఱియొక చపేటము కావలెనా? (ఇల్లం తయు దిరిగి చూచుచుండును.)

శంక—వీఁడు బ్రతికియుండిన నిఁక నా బ్రతుకు వట్టిదే. వీనిని చంపి పవరునామా గ్రహించుటకన్న మార్గము లేదు.

(తుపాకి ప్రేల్చగా రంగారావు మరణించును.)

సేవ—[ప్రవేశించి] ఎక్కడి దీతుపాకిచప్పుడు! (చూచి) హా! రంగా రావుగారిని ఖూనీచేసినాఁడు. (నిష్క్రమించును.)

శంక—ఐనది. ఎగిరిపడి- ఎగిరిపడి- పీనుఁగైనాఁడు, (పవరునామాను గ్రహించి దుస్తులను విప్పుచుండును.)

గంగారాం—[ప్రవేశించి- శంకరరావును పట్టుకొని] అరే! జల్లాద్! ఖైర్! జావ్! ఖూనీచేసి యెక్కడికి పారిపోవలె ననుకొన్నావు?

శంక—గంగారాం! ఖూనీ చేసితిని. నిజమే. కాని, గోలచేసి నన్ను నడి వీథినిఁ బెట్టి సర్కారున కప్పగించిన నీ కేమిలాభము? నీకు కొంతధన మిచ్చెదను. సంతోషముతో వెడలిపొమ్ము.

గంగా—(స్వగతం) ఇప్పుడు వీనిపిలక నాపెడికిట నిఱికినది. వీనిని సర్వ నాశనము చేసిగాని విడువను. (ప్రకా) సరే కాని, నీ వీముసలి వాని నేల హత్యచేసితివి ?

శంక—నాతండ్రి వీనికివ్రాసియిచ్చినపవరునామా వీని చేతఁజిక్కుటచేత.

గంగా—ఆపవరునామా యేది ?

శంక—(ఇచ్చి) గంగారాం ! గంగారాం ! నీకు నమస్కరింతును. నా ప్రాణము లిప్పుడు నీచేతిలో నున్నవి. నన్నుఁ జంపినను బ్రదికించినను నీవే.

(తెరలో) ఖూనీ ! ఖూనీ ! పకడో ! పకడో !

శంక—గంగారాం ! గంగారాం ! పోలీసులు వచ్చుచున్నారు. నేను పాఱిపోవలెను. రక్షింపుము ! రక్షింపుము !

గంగా—అంత భయముగలవాఁడవు హత్య యేల చేసితివి? ఉండు. పోలీసులు రాకుండ తలుపులు వేసెదను. (తలుపులు వేసి వచ్చి) రెండుషరతులకు సమ్మతించితివా బ్రతికెదవు. లేదా పోలీసువారి కప్పగింతును.

శంక—దేనికైనను సమ్మతింతును. త్వరగా చెప్పుము.

గంగా—ఈపవరునామామీఁద నీఆస్తియంతయు నాకు వ్రాసియిచ్చుట యొకటి. ఈఖూనీని నీవు చేసినట్లు సమ్మతిపత్రము వ్రాసి యిచ్చుట రెండు.

(తెరలో మరల) ఖూనీ! ఖూనీ! పకడో! పకడో!

శంక—అట్లు వ్రాసియిచ్చెదను, వేఱొకకాగితమును త్వరగా నిమ్ము.

గంగా—(ఇచ్చును)

శంక—(రెంటిపై వ్రాసియిచ్చి) గంగారాం! ఇఁక సెలవు. నన్నిపోలీసువారు పట్టుకొనఁ గల్గినప్పుడు చూచుకొందునులే.

(పాఱిపోవును.)

(తెరలో) ఖోలో! దర్వాజా!

గంగా—(తలుపు తెరచును.)

[సబ్ ఇన్‌స్పెక్టరు పోలీసులతో ప్రవేశము.]

సబ్ ఇ—అరే! బద్మాష్! ఖూనీ కియా హై తూ!

గంగా—బద్మాష్! తుమారా బావా బద్మాష్ హై, తూ బద్మాష్ హై, తూ బద్మాష్‌కా బేటా హై.

సబ్ ఇ—అరే! హంతక్! చూప్ రహెూ.

గంగా—అరే! తూ-చూప్.

సబ్ ఇ—కాన్‌స్టేబిల్! ఇస్కూ పకడ్ లేవ్!

కాన్‌స్టే—(పట్టుకొనబోవును.)

గంగా—హఠో! హఠో! దూర్ జావ్. అరే అంధా పోలీస్కా బేటా! దేఖో యే కాగజ్- ఖూనీ కౌన్ కియా జో మతల్బ్, మాలుం హెూ జాయ్‌గా—

సబ్ ఇ—(చూచి ఆశ్చర్యపడి) తబ్ శంకరరావ్ కహెూ గయా?

గంగా—ఐసా సీదా రస్తామే ఆవ్- బేటా! ఏతో భాగ్ చలా హై. మై తో ఉస్కా మకాన్ బత్లావుంగా!

సబ్ ఇ—బహుత్ ఠీక్ హై- గంగారాం సేట్! హంకూ మాఫ్ కర్ దేవ్- శంకర్‌రావ్ కా మకాన్- మేరే కూ బత్లాదేవ్.

గంగా—అచ్ఛా! సబ్‌లోగ్ హమారేసాథ్ ఆజానా చాహియే.

(అందఱును గంగారాంవెంట నడుతురు.)

(తెర వ్రాలును.)

ప్రథమాంకము.

---

# రంగూన్ రౌడీ.

అను

## పతిభక్తి.

---

### ద్వితీయాంకము.



రంగము - 1.

స్థలము:—గంగారామునియిల్లు.

[నాందీబాయి ప్రవేశము.]

నాందీ— (అనుబంధము-8.)

నామగఁడైన గంగారాంసేటునకు డబ్బుదయ్యము పట్టుకొనినది. నాబిడ్డ రాధాబాయి అంకులరాట్టము. మిండఁడెవ్వఁడును దొఱుకకపోయెనని మిడుకుచున్నది. ఇంక నే నొక్కతెను, ఇంటెడుచాకిరి చేసికొనుటకు దొరికినాను. ఇంటిమగఁడైన గంగారాంసేట్‌గారికి- ఈఁడుమీఱినను యెన్నికష్టములు పడినానో ఈశ్వరునకెఱుక. నెలతప్పి నేఁటికి మూఁడవ మాసము. "ఇఁకమీఁద ఇంటిచాకిరీ చేయలేను, దాసిని కుదర్పకతప్ప" దని దయ్యమువలె వెంటఁబడఁగా—తప్పక కుదుర్తునని ఇంటియాయన చెప్పి యెక్కడికివెళ్ళినాఁడో యిప్పటికి జాడలేదు. (విని) సందులో నెవ రాచప్పుడు చేయునది !

[దొరసానివస్త్రులతో దాసి ప్రవేశించుచున్నది.]

దాసి—ఏమమ్మా ! ఏమి ? నేనే !

నాంది—ఓహోహో ! ఈవి డెవ్వరు బాబూ ! దొరసానివలెనున్నదే !

దాసి—ఏమమ్మా! నాతో నేమైన పనియున్నదా ?

నాంది— మీ రెవ్వరమ్మా! సంతలో నేమిచేయుచున్నారు?

దాసి—నేను సేటుసాహేబుగారి సర్వెంటును.

నాంది—సర్వెంటూ? సర్వెం టంటే ఏమిటీ?

దాసి—సర్వెం టనగా తెలియనే తెలియదా? సర్వెం టనఁగా! "దాసి" అన్నమాట.

నాంది—నీవు దాసివా! అబ్బో! ఇంగ్లీషుదాసివా యేమి?

దాసి—ఆఁ! అన్నమాటే.

నాంది—అబ్బో! అట్లయిన నీకు చాకిరిచేయుటకన్న మాపై సవారీచే యుట బాగుగా తెలియునని తోఁచుచున్నదే?

దాసి—నీ కా అనవసరప్రసంగ మెందుకు? నాతో నేమైన పని యున్నదా చెప్పు, లేదా వెళ్ళెదను.

నాంది—నీవు దాసివైన నే నెవ్వతెనో తెలియునా?

దాసి—ఏమో! ఎవ్వతెవో.

నాంది— నీవుదాసివైనచో నే నీఇంటి "సేఠాణీ"ని.

దాసి—ఏమో! సేఠాణీవో సైతానీవో! నాకుఁ దెలియదు. అసలు పనియున్నదా?

నాంది—(స్వగతం) దీనిమాటలు - దీనివైఖరి చూడఁగా కొంపకు మారివలె వచ్చిన ట్లున్నది. ఇది గంగారాంసేట్‌కంటఁబడెనా నాకుఁ దక్కఁడు. కనుక- దీని నాతనికంటఁబడనీయకూడదు. (ప్రకాశముగా) అమ్మాయీ! ఉండుండు. తొందరపడివెద వెందులకు! నీవు బజారునకు వెళ్ళి రెండణాలు చేపలు, రెండు డబ్బుల ఉల్లిపాయలు, కాని చింతపండు, కాని పచ్చిమిరప కాయలు—

దాసి—ఉండుండు. నేను సంతబజారునకు వెళ్ళి సామానులు తెచ్చు దాసిముండ ననుకొన్నావా?

నాంది—మఱినీవు దాసివికావూ?

దాసి—నో! నో! అయామ్ దీ సర్వెంట్ ఆఫ్ సేట్ సాహేబ్. అనఁగా నేను సేటుసాహేబుగారి సర్వెంటును.

నాంది—అబ్బో! సీమకుక్కవలె తయారైనావు. చిల్లరపనులుచేయవు కాఁబోలును! మఱినీవు చేసేపను లేమిటే?

దాసి—హామేషా సేట్‌సాహేబుగారిదగ్గర హాజరుగా ఉండడం- ఆయనకు డ్రస్‌కావాలిస్తే అందివ్వడం- పండుకొన్నప్పుడు పంకా విసరడం- ప్రక్కవేయడం.

నాంది—(ఈర్ష్యతో) ప్రక్కవేసి పండుకోవడం.

దాసి—చెడుమాటలాడకు; చెంపదెబ్బలు తింటావు.

నాంది—ముండా! నాయింట్లో ఇందుకే చేరావఁటే!

దాసి—రండా! నన్ను తిడతావఁటే—(అనుబంధము-9.)

[ఇద్దఱును కొట్టుకొనుచుండఁగా గంగారాంసేటు ప్రవేశించును. ఇద్దఱును కలిసి ఆతనినిగూడ కొట్టుదురు.]

గంగా—శాంతించండి! శాంతించండి! గంగాగౌరీసంవాదము.

నాంది—ఈరాక్షసినిఁ దెచ్చి నానెత్తిమీఁది కెక్కించి, తిట్టించవలెననుకొన్నావా?

దాసి—ఈగయ్యాళిదగ్గర తిట్లుపడమని నన్ను తెచ్చావా?

గంగా—మీరు తిట్టుకోవద్దు- కొట్టుకోవద్దు- మాట్లాడుకోనే వద్దు- సర్వెంట్! నీవు లోపలికి వెళ్ళు.

(దాసి, నాందీబాయి మెటికలువిఱుచుకొందురు. దాసినిష్క్రమించును.)

(తెరలో) సేట్‌సాహేబ్! ఒకదర్వాన్ మీదర్శనానికి వచ్చాఁడు.

గంగా—అచ్ఛా! అచ్ఛా! రమ్మను.

జయ—*[దర్వాన్ వేషముతో ప్రవేశము.]

*దర్వాన్=హిందూస్థానీ ద్వారరక్షకుఁడు.

గంగా—బేటా ! తూ కౌన్ ?

జయ—మై హుం ఫయల్ వాన్ !

గంగా—తూ మేరా ఘుహ్కా ఆయా క్యా వాస్తే ?

జయ—నౌకరీకా వాస్తే

గంగా—నాంది ! మనకు దర్వాన్ అవసరమా ఇప్పుడు ?

రాధా—[ప్రవేశించి] ఆహా ! అవసరమే ! తప్పకుండా ఇప్పుడు మనకొకదర్వాన్ అవసరము. ముఖ్యావసరము కూడాను.

గంగా—అచ్ఛా, బేటీ ! అచ్ఛా. దర్వాన్జీ ! తుమారా నాం క్యాహై?

జయ—హర్వాన్ సింగ్.

గంగా—అచ్ఛా ! తుమారా బాప్కా నామ్ ?

జయ—బహదూర్ సింగ్—

గంగా—తుమారా బాప్కా బాప్కానామ్ ?

జయ—నారాయణసింగ్—

గంగా—ఉస్కా బాప్కానామ్ ?

జయ—కల్యాణ్ సింగ్—

నాంది—(నడుమకువచ్చి ఒయ్యారముగా)తుమారా ససూర్ కానామ్?

జయ—గంగారామ్ !

గంగా—(స్వగతం) ఏక్యా ? మేరానామ్. (ప్రకాశం) అచ్ఛా! అచ్ఛా! దర్వాన్ భాయ్! తుమ్కా తెలంగీ బాత్ మాలుం హై ?

జయ—జీ ! హాఁ !

గంగా—ఐతేహర్వాన్ సింగ్! నీవు మాయింట్లో నౌఖరీకి తగినవాఁడవే! జీతంమాట మనం ప్రత్యేకంగా మాట్లాడుకొందాం! నీకు హామేషా మాఅమ్మాయి రాధాబాయిదగ్గర కాపలాఉండేది ఉద్యోగము. తెలిసినదా ! ఎందుకో ఎఱుఁగుదువా ! ఆఁ-ఊఁ- సరే ! నీ కీఉద్యోగ మిష్టమేనా ?

జయ—చాలా చాలా యిష్టం—

గంగా—అమ్మాయీ! నీ కితఁడు కాపలాఉండడం ఇష్టమేనా?

రాధా—నాకూ చాలా చాలా ఇష్టం.

గంగా—ఐతే-నాందీ! మనం వెళదాం రా!

(నాందీ-గంగా-నిష్క్రమింతురు.)

రాధా—దర్వాన్!

జయ—భగవాన్!

రాధా—బజారునకు వెళ్ళి నాకు ఫలాహారము తెచ్చిపెట్టు.

జయ—ఇది ఎగ్రిమెంటులో లేనిమాట.

రాధా—ఐతే-నాసాడీ, చాకలషాపులో వేసి వస్తావా?

జయ—ఇది ఎగ్రిమెంటులో అసలే లేనిమాట.

రాధా—ఓహో! నీయగ్రిమెంటుసూ నిన్నూ కాస్తపరీక్ష చేయవల సినదే! (మీసము లాగివేయును.)

జయ—మై మొప్రెస్-అయాం యువర్ సెకండ్ హ్యాండ్ ఒథెల్లో.

రాధా—దర్వాన్ మహారాజ్! బ్రహ్మానందము—

(అనుబంధము - 10.)

(ఇరువురు నిష్క్రమింతురు.)

[తెరవ్రాలును.]

---

రంగము- 2.

స్థలము:—శంకరరావుమందిరము.

(అన్నపూర్ణ విచారముతో కూర్చుండియుండును.)

అన్న— (అనుబంధము - 11.)

కటకటా! ఇదియంతయు నాగ్రహకాలమహిమ దప్పవే తేమియుఁ గాదు.

సీ. వరగుణోపేతుఁడౌ ప్రాణనాయకుఁ డిట్లు
హీనదుష్కీర్తి వహించు టేమి ?
సానులతోడను సారాయితోఁగూడి
యుండి, గృహము చేరకుండు టేమి ?
జనకుని మరణమే సంతోషమని పొంగి
యంచితధనము వెచ్చించు టేమి ?
చావగాఁచిన వృద్ధజననికైనను నొక్క
పిండమైన నొసంగకుండు టేమి ?
సుతుని, భార్యను నీగతి వెతల ముంచి
వేశ్యయే లోక మని విఱ్ఱవీగు టేమి ?
కటకటా ! ఇదియెల్ల దుష్కాలమహిమ
గాకయుండిన నీస్థితిగలుగు టేమి ?

[శంకరరావు-ప్రవేశము.]

శంక—పోలీసులు—పోలీసులు—పోలీసులు. నన్ను వెంబడించుచు న్నారు ? ప్రాణేశ్వరీ ! అన్నపూర్ణా ! ఇంక నా కేది గతి ? నే నెట కేగుదును ?

అన్న—అది యేమి ? అది యేమి ? పోలీసు లేల మీవెంటఁ బడిరి ? ఏమి ద్రోహముచేసినారు ?

శంక—ఖూనీ చేసితిని. ఖూనీ—

అన్న—అమ్మయ్యో ! ఖూనీయే చేసినారా ! ఎవరిని ? ఎవరిని ?

శంక—ముసలిరంగారావును ఖూనీచేసితిని ! మాటల కిడము లేదు. నా బుద్ధికిప్పుడు ఆలోచనశక్తిపోయినది. నా కేదైనమార్గముచూపుము.

అన్న—సరే ! జరిగిన దేదో జరిగినది. ఈగదిలో దాగియుండుఁడు. తరువాతసంగతిఁ జూచుకొందము.

శంక—(ఒక గదిలోనికిఁ బోవును.)

అన్న—(తలకొట్టుకొని) ఈదిక్కుమాలినమధుపానభూత మెప్పుడావే శించినదో అప్పుడే ఇంతదారుణ మేనాఁడైన జరగునను కొంటిని! పరమేశ్వరా! ఇం కేదిదారి ?

[తులసీరావుతో గంగారాం ప్రవేశము.]

తుల—ఏఁడీ! ఆహంతకుఁ డెక్కడ ?

అన్న—(స్వగ) శ్రీరామరామ! పోలీసుపనియందున్న పాపమున నాతండ్రికే అల్లునిబంధించుకార్యము నప్పగించిరికాఁబోలును! నాతండ్రి ఉద్యోగధర్మమున దయాధర్మములుగాని, బంధు వాత్సల్యమును గాని తలంచనివాఁడు. అల్లుఁడైనమాత్రమున క్షమించునా ?

గంగా—అయ్యా! ఇదేశంకరరావుగృహము! ఉండిన నిందేయుండవలెను.

అన్న—నాయనగారూ! ఇది యేమిగంద్రగోళము!

తుల—అమ్మాయీ! ఇప్పుడు నీబాంధవ్యముతో నాకు సంబంధము లేదు. నేను పోలీసుసూపరింటెండెంటును. నాకర్తవ్యమును నేను నెఱవేర్చుకొననైతినేని నామర్యాద దక్కదు.

అన్న—పోనిండు. అదియట్లేకావచ్చును. ఇంతకునుజరిగినవ్యవహార మేమి?

తుల—నీభర్తయగు శంకరరావు రంగారావును చంపినద్రోహమున నిప్పుడు హంతకుఁడై యున్నాఁడు. అతఁడీయింటనున్నట్లు మా కనుమానముగా నున్నది! మర్యాదగా చూపెదవా ? మమ్ము సోదాచేసికొమ్మందువా ?

అన్న—నాన్నగారూ! సోదా చేసికొనుట కేమి! అదియొక విషయము గాదు. చేసికొనవచ్చునుగాని, నే నడుగుప్రశ్నకు దయతోనుత్తర మిచ్చెదరా ?

తుల—అమ్మా! ఇప్పుడు నీప్రశ్నల కుత్తరమిచ్చుటకు సావకాశమును లేదు. ఇది సమయమును గాదు. కాని సూక్ష్మముగ తెమల్చితివా చెప్పినపిమ్మట నావిధ్యుక్తకార్యమునఁ బ్రవేశింతును.

అన్న—జనకా! అల్లుఁడు హంతకుఁడే కావచ్చును. అంతమాత్రమున మీగర్భమున జనించినయేకపుత్రికనైన నాబ్రదుకును పదటఁ గలుప సిద్ధమగుటకు మీ అంతరాత్మ యంగీకరించునా?

తుల—అమ్మాయీ! నే నేమి చేయుదును? ఇది యనివార్యనిబంధనా సహితమైన సర్కారువిధి యని నీవుమాత్ర మెఱుంగవా? దానిం దప్పి నేను దోషము నోడిగట్టుకొందునా?

అన్న—తండ్రీ! నీకు కేవలము ఉద్యోగధర్మమే ముఖ్యమా! పుత్రికయందు వాత్సల్యముగాని, జామాతయందు సానుభూతిగాని యక్కఱలేదా! నాకు కష్టము వచ్చినచో-అది నాతండ్రివగు నీకుమాత్రముగాదా! నాపసుపుకుంకుమను నష్టపెట్టఁగలిగెద వా! తండ్రివగునీవు నాకు చేయు దాన మిదియేనా? కన్నవాఁడవు నీవు గలవని గంపెడాశతోనున్న నాకింక గతియేమి? జనకా! నీపాదములపైఁబడి వేడుకొందును. అల్లుని క్షమించి ఆత్మజనగు నన్నుఁ గటాక్షింపుము. ఉద్యోగధర్మము నే పట్టుకొని యూగులాడుట నీకు తగదు. నాకు పతిభిక్ష దయసేయుము.

సీ. తొడపైనఁ జేర్చి ముద్దులనాడి, నను సాకి
నట్టివాత్సల్య మేమయ్యె నయ్య?
ఘనమైన యరణంబుల నొసంగి నాపెండ్లి
సలిపినకృప యెందు సమసె నయ్య?
'అల్లుఁడా! రమ్మని యాదరించిన కృపా
పరత యెంతయును నెం దరిగె నయ్య?
కోరిన దెల్లను కొసరులేకుండ దీ
ర్చినప్రేమ యేమూలఁ జేరె నయ్య?
తుదకు నుద్యోగ మొకటి హేతువుగఁ జెప్పి
తనయగొంతుకఁ గోయుట తగునటయ్య?

లేశమును గృపలేని పోలీసువృత్తి
యనెడు కత్తిచేతను గోతు వయ్యా తండ్రీ !

గంగా—మహారాజ్! హత్యచేసినవాఁడు అల్లుఁడు. గోడునవేఁడుచున్నది కుమార్తె. అంతకఠినముగానుండుట మీకర్తవ్యమైనపనిగాదు. కొంచెము దయఁదలఁపుఁడు. ఈమాట నే నెవ్వరితోను చెప్పను.

తుల—గంగారాం! నీకు తెలియదు! నీవు మాటలాఁడకు.

గంగా—ఆమెదుఃఖమును విన్న నాకే గుండెలు నీరగుచున్నవి! కన్న తండ్రివి, లేకలేక కలిగిన యేకపుత్రిక.

తుల—ఓరీ! నీమారువాడీనక్కవిషయములు నాయొద్దసాగవు. కట్టిపెట్టు.

అన్న—తండ్రీ! ఒకరియుపదేశములు నీకేల! నీయంతరాత్మయే నీకు సాక్ష్యముగాదా! నాప్రార్థనం ద్రోసిపుచ్చక నాకు పతిభిక్షనిమ్ము.
(అనుబంధము - 12.)

తుల—అన్నపూర్ణా! లెమ్ము నీదుఃఖమును వినిన నాకు విచారముగనే యున్నది. కాని, నే నేమిచేయుదును? నాధర్మమును నేను నిర్వర్తింపక తప్పదు.

అన్న—తప్పదా? తండ్రీ! తప్పదా?

తుల—తప్పదు. తప్పదు.

అన్న—అల్లునియుసురు తీసి, ఆత్మజను విధవను జేతువా ?

తుల—అది మీ వ్రాతఫలము; నే నేమిచేయఁగలను ?

అన్న—ఆవ్రాతఫలమును మార్చుటకు నీ కధికారము కలదుకదా ?

తుల—నాకేమి యధికారముగలదు? నేను సేవకమాత్రుఁడను!

అన్న—నీవు దయఁదలంచిన రక్షింపఁగలవు.

తుల—దయగల్గినవాఁడనైనచో-నీయుద్యోగముననే చేరి యుండను.

అన్న—నీకడుపును నీవే మంటఁబెట్టుకొందువా ?

తుల—నాకడుపు మండినచో ఆదుఃఖము ననుభవింతును.

అన్న—అంతేగాని, అనుగ్రహింపవా ?

తుల—అనుగ్రహ మీజన్మమున లేదు.

అన్న—ఆశ వదలుకొనవలసినదేనా ?

తుల—నిస్సందేహముగ-

అన్న—హా ! విధీ !

గంగా—మహారాజ్ ! నీకుమార్తె - నీయల్లుఁడు-

తుల—ముసలిపీనుగా ! నోరు మూసెదవా ! మూయింపవలెనా !

గంగా—జో హుకుం. (నోరుమూసికొనును)

అన్న—(కోపముతో లేచి) ఓపాషండుఁడా ! బంధువాత్సల్యహీనుఁడా! నీవు గొడ్డుఁబోతువైన నేల కావైతివి ? కన్నబిడ్డ కడకాళ్ళంటి వేడుచుండఁగా కాఠిన్యమును బూనిననీది హృదయమా ? పాషాణమా? ఒకయబల-అందును కడుపునఁ బుట్టినబిడ్డ- శోకార్తయైన సుత—భర్తృప్రాణరక్షణమునకై ప్రాకులాడుచున్న పడఁతిమాంగల్యమును నిలిపి ఒకదీనునిరక్షించుమహాకార్యముకొఱకై, దయాదాక్షిణ్యముల నెఱుఁగని నీయుద్యోగమును వదలుకొనలేవా ? ఆర్జించినధనపుసంచులు చాలవా? సంపాదించిన బిరుదములతో సంతృప్తి గలుగలేదా ? అల్లునిప్రాణములు తీసి అధికారుల మన్ననల నందుదువు; ఇంతేకదానీప్రతాపము ! ఇదియేగదా నీయుద్యోగధర్మము ? మాసంసారమును నూరణముచేసి తండ్రివైననీ వింకొకబిరుదును సంపాదించుకొనుట ఘనమనియే యనుకొనుచున్నావా ? ఈయుద్యోగమున నీవు మాత్రము తుద కేమి బ్రాముకొనఁగలవు! ఛీ ! కలుషాత్ముఁడా ! కఠినహృదయా !

సీ. ప్రాణభీతార్తుఁడై పారిపోవఁగనున్న
యల్లుని నధికార్ల కప్పగించి

పతిభిక్ష నిమ్మంచు పదములఁబడి వేఁడు
తనయను కడకాలఁ దన్ని వేసి
పాపంపు పోలీసు పదవి చేజిక్కిన
కసాయివై పుత్రిక గొంతుగోసి
తనయ శోకింప నల్లునిఁ బట్టి యుఱికంబ
మున నిల్పి రక్తము కనులఁ జూచి
ధనము నధికారమును నీరదములై ఘనము
గాఁగ నెంచుచు, శాశ్వతకల్పకముగ
నీవు నీయధికారు లీనిఖిలజగతి
మూటఁగట్టుక చత్తురే! మూఢహృదయ!

తుల—చాలింపు మీక నీయార్భాటము! నీవు భిక్షువుకావు. నేను తండ్రినిగాను. ఆహంతకుని చూపెదవా? లేదా?

అన్న—హంతకుఁడేమో! నీవేమో! నే నెఱుఁగను.

తుల—ఓసీ! ఎఱుఁగవా హంతకుని?

అన్న—ఎఱుఁగను. ఇంక నన్నింతకన్న నేమిచేసెదవో చేసికొనుము.

తుల—ఆద్వారమునువదలి నాకుదారినిమ్ము-ఇల్లు సోదా చేయవలెను.

అన్న—గుమ్మమును వదలను.

తుల—వదలవా?

అన్న—వదలను.

తుల—వదలించెదనుసుమీ!

అన్న—ఆఁడుబిడ్డపై చేయిచేసికొనఁగలిగినచో చేసికొనుము; నేను వదలను.

తుల—అధికారము నాకడనుండ ఆఁడుదియేమి? మగవాఁడేమి?

(బలవంతముగ తోసి లోని కరుగును.)

అన్న—(రెండవద్వారమున-శంకర రావును బయటకుఁ దెచ్చి) స్వామీ! ఇంక మీరు పారిపొండు! నాతండ్రి చూచిన నిప్పుడే బాధింపఁ

గలఁడు. భగవత్కృపయున్న నెన్నఁటికో పునర్దర్శనము. లేదేని యిదే కడచూపు. మీపాదములకు నమస్కారము.

శం—(పారిపోవును.)

తుల—(బయటకు వచ్చి) గంగారాం! ఆహంతకుఁడు పరారియైనాఁడు. ఈయింట కనఁబడలేదు. రమ్ము. వెంటనంటుదము.

తుల—
గంగా— } (ఇద్దఱును నిష్క్రమింతురు.)

అన్న—(చేతులు జోడించి) భగవానుఁడా! నాప్రాణేశ్వరుని ప్రాణ రక్షణమున కిఁక నీకన్న దిక్కెవ్వరును లేరు. రక్షింపుము.

(అనుబంధము 13.)

(నిష్క్రమించును.)

(తెర బ్రద్దలై ఓఁడ కాన్పించును. శంకరరావు ఓఁడలోని గాలి గొట్టముచాటున దాగియుండును. తులసీరావు సముద్రతీరమునకు పోలీసులతో వచ్చును. శంకరరావు సముద్రమున దూకును. ఓఁడ నడచి పోవును. తులసీరాయాదులు నిష్క్రమింతురు. ఒక తిమింగిలము ఈఁదుచున్న శంకరరావువెంటఁ బడును. ఇంతలో షికారుచేయుచు వచ్చిన రమేశబాబును, ప్రభావతియు, నావపై కాన్పింతురు. ప్రభావతి పిస్టలుతో తిమింగిలమును చంపును. రమేశబాబు వలవేసి శంకరరావును నావలోనికి చేర్చి రక్షించును.)

(తెర-మెల్లఁగా వ్రాలును.)

ద్వితీయాంకము.

---

# రంగూన్ రౌడీ

అను

## పతిభక్తి.

---

### తృతీయాంకము.



రంగము - 1.

స్థలము:—రంగూనులో రమేశబాబుమందిరము.

[ప్రభావతి హార్మోనియం వాయించుచు, పాడుచుండును.]

శంక—(ప్రవేశించి) ప్రభావతీదేవీ! ఇనుమువలె, కఠినమైన నాహృదయమునుసయితము మనోమోహనమైన మీసంగీతము సూదంటురాయివలె యీడ్చుకొని వచ్చినది.

ప్రభా—(లేచి మేలిముసుఁగు సవరించుకొని) శంకరరావుబాబూ! ఈయాసనముపైఁ గూర్చుండుఁడు. రంగూన్ పట్టణమును మీ రిదివఱ కెన్నఁడును చూడలేదు కాఁబోలును. ఎట్లున్నది?

శంక—ఏమని చెప్పుదును! ఇది దేవేంద్రుని యమరావతీపురముతో సమానమైనదనియు, నిచ్చట నైరావత మను తెల్లయేనుఁగు సయితము కలదనియు, నిచ్చటి స్త్రీలు వృద్ధాప్యము నెఱుంగక దేవతాస్త్రీలం బోలియుందురనియు కథలుగా చెప్పుకొనుట వింటినే కాని, కన్నులఁ జూచియెఱుఁగను. నీకృపారసమున నీ పురసందర్శనభాగ్యముం గంటిని.

సీ. అత్యగాధము దీర్ఘమైన యైరావతి<br>
స్వచ్ఛోదకంబు లొసంగుచుండ,

అంబర మంటు బౌద్ధాలయశిఖరంబు
హేమప్రదీప్తి వహించుచుండ
నారాయణుని దివ్యనవమావతారమా
బుద్ధదేవుఁడు శాంతమూర్తినుండ
అప్సరసౌందర్య మరసి యోడించు బ
ర్మాస్త్రీలు నేత్రపర్వంబు సేయ
నిచటి సౌధపంక్తి యిచ్చటి సుందరో
ద్యానవితతి నెందుఁగానఁబోము;
రమ్యవిజితసురపురంబైన రంగూను
పురముసాటి వేఱుపురము లరుదు ?

పరిభా—ఆమహాసముద్రమునం దానాఁడు మొసలివాతనుండి మీరు మరణించియుండినచో నిజముగా దేవేంద్రునగరమునే చూచి యుందురు. కాని, తలవెంట్రుకంతయదృష్టరేఖ తలసూపుటచేత భూతలదేవేంద్రనగరమునకు వచ్చు పుణ్య మబ్బినది.

శంక—చావనున్న నన్ను బ్రదికించిన మీసతీపతు లిర్వురకును జన్మాంతము నేను కృతజ్ఞుఁడనై యుందును. దాని నట్లుండనిండు. ఆ నాఁటివిషయమును మిమ్మడుగుటయే మఱచితిని. ఆ చిన్న నావపై తమరు కాకినాడ రేవునకు వచ్చుచుండినకారణమేమి?

పరిభా—నాభర్తగారైన రమేశబాబుగా రీరంగూన్‌పట్టణమున నొక లక్షాధికారియగు వర్తకు లనుసంగతిని తెలిసికొంటిరిగదా! మీ కోరంగిజాతివాఁ డొకఁడు రంగూనులో బాకీచేసి కాకినాడసమీపమునసున్న తాళ్ళరేవున తల దాచుకొనెననువార్త నెఱింగి, స్వయముగ నాభర్తగారేవచ్చిరి. అదృష్టవశమున బాకీదారుఁడు దొరికెను. చిన్నప్పటినుండియు, నా నాథునకు చేపలవేట ప్రియమైనదగుటచేత చిన్ననావపై వేటాడుచు, మేమచ్చటికివచ్చితిమి.

శంక—ఆహా! భగవత్సంకల్ప మెంత చిత్రమైనది! ఇంతకును అదియొక హేతువయ్యెనుగాని, నాయాయుర్ద్రాయబలమువలన భగవం తుఁడే మిమ్మచటికిఁ బంపెను. సరిగాని, మీరిప్పుడు 'మీకోరం గిజాతివాఁ'డని ఏమో పలికితిరి. కోరంగిజాతియనఁగా నేమి?

ప్రభా—మీరు కోరంగిజాతివారుకారా?

శంక—"కోరంగిజాతి" యను నొక జాతి కలదా?

ప్రభా—ఆహా! కలదు. మీరే, "కోరంగిజాతి" వారు. మీజాతిపేరే మీకు తెలియదనిన నాకాశ్చర్యముగా నున్నదే?

శంక—కోరంగి యేమో, జాతియేమో, నే నెఱుఁగను. మే మాంధ్ర జాతివారము. కాదేని, తెలుఁగువారము.

ప్రభా—అది యేమోకాని, మీజాతివారిని బర్మాదేశమునందు కోరంగి జాతివారనియే పిలుతురు. మిక్కిలి హీనముగాకూడఁజూచెదరు.

శంక—(ఆశ్చర్యముతో) భళీ! ఇది కడువింతయైనమాట.

గీ. అకటకట! పూజ్యమైనట్టి ఆంధ్రజాతి
గౌరవము మాని "కోరంగి" వారటంచు
హీనముగఁ బల్కువారె! రంగూనులోన
నితరజాతులకంటికి హేళనముగ.

ప్రభావతీదేవీ! మాజాతి కింతటి గౌరవహీనత గల్గుటకు కారణమేమో మీ రెఱుఁగుదురా?

ప్రభా—కారణములు కనఁబడుచునే యున్నవికాదా!

శంక—నా కేమియు కనఁబడుటలేదు. దయచేసి యెఱింగింపుఁడు.

ప్రభా—

సీ. జనుల నందఱను కంచరగాడ్రెలట్లు మే
రకమోయువారు కోరంగివారు
గౌరవవ్యాపారకార్యంబు సేయనే
రనికూలివారు కోరంగివారు

అన్నిజాతుల కాలిపన్నాలదెబ్బల
శ్రమ కోర్చువారు కోరంగివారు
మానంబు వోనాడి మలమూత్రములను శు
భ్రముచేయువారు కోరంగివారు
కొట్టినను తిట్టిన సహించి, గొడ్లవోలె
లొంగియుండుబానిసలు కోరంగివారు
నాగరకతయు, దేహసౌందర్యగరిమ
యుం గలుగనట్టివారు కోరంగివారు.

శంక—హరి హరీ! ఈపాపపుచెవులతో నెట్టిమాటలు వినుచున్నాను! ప్రభావతీదేవీ! ఎట్టిగౌరవనీయమైనజాతి కీనగరమునం దెట్టిదుర్గతి గలిగినదో తలంచినకొలఁదియు గుండెలు ప్రీలిపోవుచున్నవి.

సీ. ఆందోళికలనెక్క నాంధ్రజాతికి నేఁడు
*లంచాల నీడ్చుకాలంబు వచ్చె
అవనిఁ బాలించిన యాంధ్రజాతికి నేఁడు
కూలిచే జీవించు గోఁడువచ్చె
అతిశౌర్యవంతమా నాంధ్రజాతికి నేఁడు
†పన్నాలదెబ్బల పాట్లు వచ్చె
అధికగౌరవనీయ మాంధ్రజాతికి నేఁడ
శుద్ధంబు తుడిచెడి క్షోభ వచ్చె
అసమసాధ్వీత్వంబున కీర్తి నందినట్టి
యాంధ్రజాతికి లంజలౌ నపయశస్సు
వచ్చె; నాగరకత గల్గువారి కిపుడు
మోటువా రను కట్టడిమాటవచ్చె.

అన్నిటిమాట యట్లుండగా నీకోరంగియను బిరుద మెక్కడినుండిదాపురించెనా యని నా కాశ్చర్యముగా నున్నది.

*లంచా=రిక్షాబండి. †పన్నా=కఱ్ఱపాదరక్ష.

ప్రభా—అయ్యో ! నే నెఱుఁగను గాని ఆదినుండియు మీజాతి కీ బిరుదము.

శంక—ఊహించిచూడ నా కొక్క హేతువు గోచరించుచున్నది. ప్రాయశః అదియే వాస్తవమైనను గావచ్చును.

ప్రభా—ఏ దా హేతువు ?

శంక—కాకినాడసమీపమున కోరంగి యను నొకపల్లెటూరు కలదు. ఆరంభమున విశేషజనులు కూలిపనులకై కోరంగిగ్రామమునుండి వచ్చియుందురు. ఇచ్చటివారు మీ దేయూరని యడిగిన "కోరంగి" యని చెప్పియుందురు. ఆనాఁటినుండియు నెచ్చటనుండి యాంధ్రుఁడు వచ్చినను, కోరంగివాఁ డని పిలుచుటయే ఆచారముగ మాఱియుండును.

ప్రభా—అదే నిజమై యుండును. ఇప్పుడు ఈక్షోభయంతయు మన కెందులకు గాని, శంకరరావ్గారూ ! నీ వనినట్లు మీజాతియందు కూలివాండ్రు నాగరకత లేనివారే గాని అందఱకు నొకేవిధమగు నపకీర్తిని గల్గించుట యన్యాయమని నా కిపుడు దోఁచుచున్నది సుమా !

శంక—ప్రభావతీదేవీ ! ఎందుచేత ?

ప్రభా—ఎందుచేత నననేల ? అందులకు కోటిమన్మథాకారసమానమైన నీముఖమండలమే ప్రబలతార్కాణమై యుండ లేదా ?

శంక—(నవ్వి) అట్లనా ! నాముఖ మెట్లు మీకుఁ గనఁబడుచున్నది.

ప్రభా—ఎట్లా? చెప్ప మందువా ?

ఉ. అంగజమోహనంబగు మహత్తరతావకరూపరాశి, క
న్నుంగవఁ దోఁచినంతనె మహోజ్జ్వలమారశరాగ్నికీల నా
యంగము సర్వమున్ దహనమందగఁజేసె ననంగ నింక నీ
యంగవిలాస మెట్లు తెలియంగల నీగతిఁ గాక వేఱుగన్.

శంక—వట్టిమాట - ఇది యంతయును నన్ను హసించుటకుఁ గావలయును. కానిచో నింతకుమున్నే కదా కోరంగిజాతి యనాగరకజాతియని గర్భశూలాయమానముగ నెత్తిపొడిచితిరి.

ప్రభా—అది జాతియంతటిమీఁదను చేయఁబడినవిమర్శ. ప్రత్యేకవ్యక్తులకాధిక్యత యుండఁగూడదా ?

శంక—ఓహో! నీ వొకగొప్పవిమర్శకురాలివలె నున్నావే! సాక్షిసంఘమున బొట్టయ్యసెట్టి చచ్చినపిదప సభ్యుఁడు కొఱఁతవడినాఁడఁట. జంఘాలశాస్త్రికి దరఖాస్తు చేయుదువా ?

ప్రభా—సాక్షి యేమో, సంఘ మేమో నే నెఱుఁగను గాని, నేను మకరమును చంపి చావనున్ననిన్ను రక్షించినసాహసకార్యములయొక్క ఋణభారమును నీ వేరీతిగ వదల్చుకొనఁ దలఁచితివి?

శంక—ధనము మినహా - నావద్దకల దేదియైన దాచక యిచ్చెదను.

ప్రభా—మానవుని ముఖభాగమునందు నవనీతమునకన్న మృదులమై, రోజాపుష్పమునకన్న మనోహరవర్ణవిభాసితమై యొప్పారు ప్రదేశమేది ?

శంక—అధరము కావచ్చును.

ప్రభా—షడ్రుచులందును సమస్తజీవకోటికిని ప్రియతమమైనరుచి యేది?

శంక—మాధుర్యము కావచ్చును.

ప్రభా—అధరమునం దట్టిమాధుర్యము నొసంగఁగలయనుభవ మేది గలదో దానిని నా కిచ్చినట్లైన నీఋణభారమునుండి విముక్తి నొందగలవు.

శంక—చుంబనమా! అబ్బా! చుట్టుమాటలతో న న్నెంత క్షోభపెట్టితివి?

(అనుబంధము 14.)

(తెరలో పాదసంచలనము.)

ప్రభా—పాదసంచలనముచేత నా ప్రాణేశ్వరునిరాక తెలియుచున్నది.

(ఇరువురు క్రమసితియం దుందురు.)

[రమేశబాబు ప్రవేశము.]

శంక—మహాశయా! నమస్కారము.

రమే—మహానందము. కూర్చుండుము శంకరరావుజీ!

(తానును కూర్చుండును.)

శంక—(కూర్చుండును.)

రమే—మాయింట మీకేలోపమును గల్గుచుండుట లేదుగదా?

శంక—ఆ! ఆ! యెంతమాటాడితిరి! నాస్వగృహమునకన్న నధికముగా సుఖించుచున్నాను. తమరు నా తండ్రికన్న నధికాదరణమును చూపుచుండ ప్రభావతీదేవి నా తల్లికన్న మిన్నగా నన్నుఁజూచుచున్నది. నాపురాకృతభాగ్యఫలమువలన నేమీ చేరక్షింపఁబడితిని. కాని నా హృదయమందలి భీతిమాత్రము నన్ను వదలకున్నది.

రమే—మిత్రుఁడా! పోలీసువారిభయము నీ కెంతమాత్రము నక్కఱలేదు. నే నీపట్టణమున నున్నంతవరకు నీప్రాణములకు నాప్రాణముల నిచ్చెదను. ధైర్యము నవలంబింపుము.

శంక—మహాభాగ్యము.

సేవకుఁడు—[ప్రవేశము] (సలాంచేసి చీటి నిచ్చి) మహాప్రభూ! అవధారు కాకినాడపోలీసుసూపరింటెండెంటుగారఁట తమదర్శనము కోరుచు ద్వారమున పోలీసుభటులతోఁగూడ వేచియున్నారు.

శంక—మహాశయా! అతఁడె నామామయగు తులసీరావు. వెంటనంటి యిచ్చటికిఁగూడ వచ్చినాఁడు. నన్ను రక్షించుటకు మీకిదే సమయము.

రమే—శంకరరావుజీ! భయమందకు. నీవు నీజననితోఁగలిసి అంతఃపురమున నుండుము. నే నాతని సాగనంపెదను.

శంక—రమేశమహాశయా! బహూత్ మెహర్బానీ! మాతాజీ! దయచేయుము.

శకం—
ప్రభా— } (నిష్క్రమింతురు.)

రమే—నౌఖర్ ! ఉనుక్యా అందర్ ఆనే దో !

సేవ—జో హుకుం (సలాం చేసి నిష్క్రమించును.)

[భటసమేతముగా తులసీరావు ప్రవేశము.]

తుల—రమేశమహాశయా ! సలాం ఆలేఖుం.

రమే—ఆలేఖుం సలాం. బైఠియే ! తులసీరావుజీ !

తుల—(కూర్చుండి) జనాబ్ ! సావకాశముగ గూర్చుండుట కిది నాకు సమయము గాదని విన్నవించుకొనుచున్నందులకు క్షమింతురని నమ్మెదను. నే నొకకార్యభారమును పైనిడికొని తమదర్శనము నకు వచ్చితిని.

రమే—మంచిది. మీ రేకార్యభారమునవచ్చితిరో తెలియఁజేసెదరా ?

తుల—ఈనడుమ కాకినాడలో రంగారా వనుపేరుగలవృద్ధుని ఖూనీ చేసి యీరంగూన్ పురమునకు పరారీ యయివచ్చినశంకరరావు. అనువానిచరిత్రమును మీరు వార్తాపత్రికలమూలముననైనను వినియుందురు.

రమే—ఆ ! వినియుంటి ననుకొందును. ఆవిషయమున నావలన నేదైన సహాయము నపేక్షించి వచ్చితిరా ?

తుల—క్షమింపవలయును. ఏదైనసహాయముకొఱకు నేను వచ్చియుండ లేదు. చక్రవర్తిపేరుమీాద హంతకుని నా కప్పగింతురనియే. నమ్మి వచ్చితిని.

రమే—మీాయభిప్రాయము నాకు తెలియలేదు. మీావెంట నేను భటుని వలె తిరిగి హంతకుని పట్టుకొనవలయు నని మీాయభిప్రాయమా?

తుల—అంతటిమాటను లక్షాధికారులగు తమ్ముగ నే ననఁగలనా ?

రమే—అంతకన్న మీాయభిప్రాయ మేమి ?

తుల—నాయందు తప్పుగలదేని క్షమింపుడు. కాని, సర్కారుహుకుము నాకడ నున్నందున, సజ్జనులైన తమ్ము నొప్పింపవలసివచ్చు చున్నది.

రమే—నీదొంగతనములను గట్టిపెట్టు. నీప్రవర్తన సందేహాస్పదముగ నున్నది.

తుల—అయ్యా! నన్ను సందేహించెదవా? నీయందే నేను సందేహముం బూనవలసియున్నది.

రమే—ఎందులకై ?

తుల—హంతకుని నీయింట దాచినందులకై.

రమే—ఓ మర్యాదహీనుఁడా ! ఎవరితో మాటలాడుచుంటివో యెఱింగి యుంటివా ?

తుల—ఆహా ! సంపూర్ణముగా నెఱుఁగుదును.

రమే—నేను గొప్పపలుకుబడికలుగు లక్షాధికారిని సుమా !

తుల—హంతకుని దాఁచినయపరాధివికూడను.

రమే—బస్! బస్, ఇఁకచాలు. మాటలాడక నాయిల్లు కదలు.

తుల—హంతకునిఁబట్టి యిమ్ము. కదలెదను.

రమే—నాయింట లేఁడు.

తుల—లేఁడా నీయింట ?

రమే—లేఁడు.

తుల—అమర్యాదపాలు గాకు. సోదాచేయవలసి వచ్చును.

రమే—సాహస మున్న సోదా చేసికొనుము.

తుల—భటులారా! ఈయిల్లు సోదాచేయుఁడు.

భటు—(వెదుకఁబోవుదురు.)

రమే—హాత్ జావ్ !

(మెల్లగా తెరవ్రాలును.)

స్థలము—కృష్ణమూర్తియిల్లు.
[అన్నపూర్ణ, జానకి ప్రవేశము.]

జాన—వదినా! దుఃఖించిన ప్రయోజన మేమైన నున్నదా? కన్నులు వాంచి, కడుపు రవుల్కొనిపోవుటకన్న కార్య మేమియున్నది? సర్వము దెలిసినదానవు నీవును సంతాపమందిన నింకేమైన నున్నదా?

అన్న—మఱదలా! భర్తృవియోగదుఃఖ మొకటి కార్చిచ్చువలె కాల్చుచుండగా, మామగారు సంపాదించినయాస్తి గృహసమేతముగ మార్వాడిచేతం బడినప్పు డీవ్యర్థప్రాణికి దుఃఖముగాక, యింకే మున్నది! పోనిమ్ము, ఆస్తిమాట యేమైనను ఆయనప్రాణము లైన తిన్నగానుండిన సంతసించి యుందును. రాజభీతిచే రంగూనునకు పలాయితుండైనప్రాణేశ్వరుండు మఱల వచ్చునా? నాకు దక్కునా? (ఏడ్చును.)

జాన—ఏమిపని యిది! చంటిబిడ్డవలె నేడ్చుట సమంజసమేనా!

ఆ. వె. ఒక్కరీతి దినము లుండునె! సాంద్రఘ
నాఘనములు వాయుహతిం దొలంగు
నట్టు లెన్నడైన నాపద లెడంబాసి
శుభము గలుగకున్నె శుభవిచార!

అన్న—ఏనాటికైన సుఖమై వచ్చి మన కందఱ కానందముం గూర్పంగలండు గాని, ఇదియేమి! ఆస్తి నంతను గంగారామునకు వ్రాసి యిచ్చుట యెందులకో తెలియకున్నది. మోసమేమైన జరిగి యుండునేమో!

[కృష్ణమూర్తి మోహనరావుతో ప్రవేశించును.]

జాన }
అన్న } (లేచి నిలుతురు.)

కృష్ణ—అక్కా! కూర్చుండుఁడు. చిన్నవాఁడనైన నాయొద్ద మర్యాద యేల! (కూర్చుండును.)

మోహ—అమ్మా! అమ్మా! (తల్లిదగ్గరకు పోవును.)

అన్న—నాయనా! నామోహనా! నీ దెట్టిపురదృష్టజాతకమురా తండ్రీ!

చ. ధనముగలంతకాలమును, తప్పక నీతఁ డదృష్టజాతకుం
డనుచు వచింతురీ భావిఫల మంతయుఁ దెల్పెడివారిపోల్కె బ్రా
హ్మణులు ధనాశచేత; నిజమంచుఁదలంతురీ జనంబు దాని; నీ
యనుపమఫాలభాగలిఖితార్థముఁదెల్పఁడు జోస్యుఁడొక్కఁడున్.

కృష్ణ—అక్కా! పండితులపల్కు లొక్కనాఁడును ప్రమాణరహిత ములు కాఁజాలవు. వారు వచించినచందమున నాచిన్ని మేనల్లుఁడు తప్పక అదృష్టజాతకుఁడే కాఁగలఁడు.

అన్న—తమ్ముఁడూ! కలిపోసినను ఉట్టివంకకే చూచె ననువిధమున మాటాడుచుంటివిగదా! ఐశ్వర్యమంతయుఁ దగులఁబడిపోయినను, అల్లుఁడుమాత్రమదృష్టశాలియే యనుచుంటివి.

కృష్ణ—సోదరీ! కుఱ్ఱవానివిషయమున నీకిట్టిబెంగతో నిమిత్తములేదు. ఏమందువేని-

ఉ. తల్లియుఁ దండ్రియున్ సుతులు తాతలు నేతలు కల్గ రెవ్వరున్
చెల్లకయున్న దీధన మశేషముగా, తిన దిక్కులేక నా
కెల్లవిధంబులన్ సుఖము నిచ్చె నిలన్ పరమేశ్వరుండు; నా
యల్లున కిత్తు నాధనమునందు సగంబు; సతీవతంసమా!

అన్న—నాయనా! నీయుదారహృదయమునకు భగవంతుఁడు నిన్నాశీర్వదించునుగాఁక! ఎప్పటికి నీకిట్టిబుద్ధియే స్థిరమైయుండుఁగాక! నీవు నామఱదలగు జానకిని ప్రేమించి వివాహమాడఁదలంచినందువలననే మీకును మాకును గలసంబంధముగాని, నిజము విచారించినచో అంతకన్న మాపై దయఁదలంచు నవ

సరము నీ కేమియున్నది ! తండ్రి యైశ్వర్యమును పోగొట్టుకొని నాచిన్నతండ్రి యితరుల తిండికొఱ కాశించునా ! ఇది యెన్నఁటికిని జరగదు. భాగ్యము లేకున్న యెడల పంచలఁ బట్టుకొని బిచ్చమెత్తుకొని జీవింతుము గాని, పరాన్నభుక్కుల మగుదుమా !

కృష్ణ—(స్వగతం) ఆహా ! పరమేశ్వరా ! ఈమె కిట్టిబుద్ధి పుట్టనేల !

మోహ—మామా ! నాకొక చిన్న మోటారుబండి కొనిపెట్టవూ !

కృష్ణ—మోటారుబండితో నేమిచేయుదువు మామా !

మోహ—నాన్నగారిదగ్గఱకు వెళతా !

అన్న—(తనలో) హా ! తండ్రి ! నాయనగారిదగ్గఱకు వెళ్ళుభాగ్యమే యున్నయెడల మన యదృష్టరేఖ లిట్లుండ నేలరా !

కృష్ణ—మీనాన్నగా రెక్కడ నున్నారు మామా !

మోహ—మాపెద్దబంగాళాలో నున్నారు.

కృష్ణ—లేరుమామా ! మీపెద్దబంగాళాలో మారువాడీవాఁడున్నాఁడు. మనము వెళ్ళితిమా వాఁడు కఱ్ఱతీసికొని కొట్టును.

మోహ—ఆ ! ఏమిటీ ! మామయ్యా ! మారువాడీవాఁడా! మనలను కొట్టునా ! నాబలము తెలియకుండా మాటాడినావు మామయ్యా ! వానిబుఱ్ఱ చితుకగొట్టెదను. నావెంట నిప్పుడే రా

(అనుబంధము - 15)

కృష్ణ—ఆగు ! మామయ్యా! పోవుదము. మీనాయనకన్న మంచిపేరు తెచ్చుకొనెదవు మామా ! (ముద్దిడుకొనును)

అన్న—హా తండ్రీ! నీముద్దుమురిపెములను చూచుటకు నీతండ్రిగారి కదృష్టమున్నదో ! లేదో కదా !

ఆ. వె. కన్నతండ్రి ! ఇంతపిన్నటనే నీకు
పితరుఁడుండి లేనిగతిఘటిల్లె;

నిన్నుఁ గాంచుభాగ్య మున్నదో లేదో; నీ
తండ్రికంచు గుండెతల్లడిల్లు. (ముద్దిడుకొనును.)

మోహ—అమ్మా! అమ్మా! నీవెందు కేడ్చుచున్నావే!

అన్న—ఇఁక నా కేడుపే విధి విధించియున్నాఁడు తండ్రీ!

మోహ—అమ్మా! నిన్నెవరేమన్నారో చెప్పవే. వాళ్ళను చితుక కొట్టివస్తాను.

కృష్ణ—అక్కా! మీ రిక్కడనుండిన నిల్లే దుఃఖింతురు. మీరు దుఃఖించినకొలఁదియు కుఱ్ఱవాఁ డడలుచున్నాఁడు. మీరు లోనికిఁ బొండు. మే మేదో విధాన మాలోచించి, మార్వాడీచేఁజిక్కిన మీయాస్తిని మీకు వచ్చునట్లు చేయుదుము.

అన్న—నాయనా! మంచిది—మోహనా! రమ్మ మనము లోనికి బోవుదుము. (లోని కిరువురును నిష్క్రమింతురు.)

కృష్ణ—జానకీ! ముందుకర్తవ్యమేమి?

జాన—మీ మిత్రుఁడు జయరాం గంగారామునికుమార్తెను వలచి వారియింట దర్వానుగా చేరియున్నాఁడని చెప్పితిరే! తన్మూలమున సాధింపలేమా!

కృష్ణ—అవును-నిజమే! జయరాముఁడు నాకడకు వచ్చెదనని చెప్పెను. ఇంకను రాకున్నవాఁ డేమి చెపుమా!

జయ—[దర్వాన్ వేషమున ప్రవేశము.]

కృష్ణ—(స్వ-) ఎవ్వ రీపురుషుఁడు! (ప్ర-) అయ్యా! నీ వెవ్వఁడవు?

జయ—ఏమంత యగౌరవముగ "నీ వెవ్వఁడ" వని మాటలాడుచున్నావు! కనుపడుటలేదా! నేను పైల్ వానును.

కృష్ణ—కావచ్చును. ఐన నిన్ను నే నగౌరవించిన దేమున్నది?

జయ—అంతయు నగౌరవము. ధనగర్వము.

కృష్ణ—తప్పున్న క్షమింపుఁడు. కాని నీ రాక కేమి కారణము?

జయ—కారణమా ! మా ప్రభువైనగంగారాంసేట్‌గారికి శంకరరావు చాలధనము బాకీ యున్నాఁడఁట. శంకరరావుభార్యాపుత్రులు నీయింట నున్నారఁట. వా రేమి చెప్పెదరో తెలిసికొని రమ్మని మాసేట్‌గారు పంపినారు.

కృష్ణ—అట్లయిన, మా కేమియు భయములేదు. ఈ దర్వాన్ మా మిత్రుఁడు జయరాంసింగ్ తప్ప వేరొకరు కాఁడు. (మీసము లాగివేయును.)

జాన—(నవ్వుచు నిష్క్రమించును.)

జయ—(నవ్వుచు కౌఁగిలించుకొని) మిత్రమా ! నావేష మెంత చక్కఁగా నమరినదో, నీకు తెలియఁజేయుటకై నే నొనరించిన యీ చిన్నిహాస్యమునకు మన్నింపఁదగును.

కృష్ణ—మిత్రుఁడా ! జయరాం ! ఈ మాత్రమునకే నీవు క్షమాపణ వేడుకొనవలయునా ! బాల్యమిత్రులమైన మనకు పరిహాసము లు పరిపాటియేగదా ! అందు నీవు కవీశ్వరుఁడవుకూడను. నీతో మేము మాటాడఁగలమా !

జయ—దాని నట్లుండనిమ్ము. ఇంతకును, నీవు నన్నుఁ బిలువనంపిన కార్యమేమి ?

కృష్ణ—నీవు గంగారాంసేట్‌మందిరమున దర్వాన్‌పనియందున్నావఁట కాదా?

జయ—ఒక "లవ్ ఎఫెయిర్" (Love affair) లో పడిపోయి నే నట్లు చేయవలసివచ్చినమాట నిజమే. కాని ఇప్పుడు నా యుద్యోగముమాట యెందులకు ?

కృష్ణ—ఉన్నవ్యవహారమే దానితో నున్నది. లక్షాధికారియైనశంకర రావుఐశ్వర్యము నంతను, యెట్లో మోసమున నీకు కాఁబోవు మామగారైనగంగారాంసేట్ చేఁజిక్కించుకొనినమాటను విని యుంటివికదా ?

జయ—ఆ! వినుటయేకాదు. శంకరరావు తన స్వహస్తములతో తన తండ్రి రంగారావున కిచ్చిన పవరునామామీఁద వ్రాసియిచ్చిన అక్షరములనే చూచితిని.

కృష్ణ—ఇప్పుడు మన కా పవరునామా కావలెను. ఏయుక్తిచేత నైన గ్రహింపక తప్పదు. ఇంక నీ మిత్రవాత్సల్యముం జూప వలెను.

జయ—త్రాగుబోతును, హంతకుఁడును నగు శంకరరావుకొఱకుగాదు గాని, పవిత్రమగు నీబాల్యస్నేహవాత్సల్యముకొఱకును, మహా సాధ్వియగు అన్నపూర్ణాదేవిసౌశీల్యముకొఱకును, గంగారాము నిర్లోభిత్వముకొఱకును నా శిరస్సునైననుకోసి యిచ్చెదను.

కృష్ణ—ధన్యవాదములు! జయరాం! నీకు ధన్యవాదములు.

జయ—అది సరికాని, మిత్రుఁడా! ఇప్పుడు నీకు శంకరరావుపై నింత వాత్సల్యము గలుగుట కేమికారణము?

కృష్ణ—ప్రాణమిత్రుఁడ వగు నీయొద్ద నాకు దాపరిక మేమున్నది?

ఆ. వె. గంగరాముసుతనుఁ గాంక్షించి నీవు ద
ర్వానువృత్తినైనఁ బూనినటులె
జానకీలతాంగి నేను గాంక్షించి యీ
మోసవృత్తినైనఁ బూనవలసె.

శంకరరావు సర్వైశ్వర్యములును గంగారామునివశమగుటవలన నిప్పుడిం చుమించుగా వారిసంసారభార మంతయు నాయందే యున్నదనినమాట.

జయ—లక్షాధికారివి; ఒంటరిగాఁడవు; దుర్వ్యసనములు లేనివాఁడవు; నీ వీసంసారమునే కాదు? ఇట్టివానిని పదింటినైన పోషింపఁగ లవు. అది యుక్తముగానే యున్నది గాని ప్రేమవిషయమున నీకును నాకును సమానధర్మము చెప్పితివి, గాని సరిపడని విషయమే సుమా! ఏమందువేని-

ఆ. వె. నీవు వలచినట్టి నెలతుకసోదరు
కొంప నిలుప నీవు గోరినావు
నేను వలచినట్టి నెలతుకజనకుని
కొంపదీయ నేను గోరినాను.

కృష్ణ—మహాకవివి; నీతో నేను మాటలాడఁగలనా? ఇఁక నీవు నీకార్యమునం దుండుమువుకదా ?

జయ—అవశ్యకముగా !

కృష్ణ—మిత్రమా ! చిరకాలమునకు వచ్చితివి. చిష్నవిందారగించి పోవుదువుగాని లోనికి రమ్ము.

జయ—మంచిది.

(అనుబంధము-16.)

(ఇరువురును నిష్క్రమింతురు.)

తృతీయాంకము.



# రంగూన్ రౌడీ

అను

## పతిభక్తి.

చతుర్థాంకము.



రంగము-1.

స్థలము—రంగూన్ రాజసరోవర ప్రాంతము.

[ప్రవేశము.—అన్నపూర్ణ, మోహనరావుతో.]

అన్న—కటకటా ! వలదు వల దని కృష్ణమూర్తియు, జానకియు నెంత చెప్పినను సముద్రమును సైత మతిక్రమించి, కుట్టువానితో రంగూను చేరుకొంటిని. వెంటఁగొనివచ్చిన స్వల్పధనమును వెచ్చించితిగాని, యిప్పటికిని నానాథునిజాడ యీ పురమునఁ గానరాదయ్యె. విశ్రాంతమైన యీమహాపట్టణమున, విభునియునికి నాకెట్లు తెలియును? పోలీసులభీతిచే నెందైన దాగియుండెనో, కాక బాధింపఁబడెనో, పలుకరాకు గాని, ప్రాణములనే వదలెనో ! దైవమా ! నా కెట్లు తెలియును ? ఈపట్టణమున నాకు దిక్కెవ్వరు ? మ్రొక్కెవ్వరు ?

సీ. పావనశ్రీబుద్ధదేవాలయంబైన
పెద్దపయాగుడి వెదకినాను
అసమాన విక్టోరియామహోద్యానంబు
నంతయుఁ బూన్కిమై నరసినాను
మధురాతులైన యధమలనెలవుల
శేషంబు వెదకింపఁ జేసినాను.

ఉత్తమాంగనల కయుక్తంబులైన రం
డీలగల్లీలలో నెమకినాను

గీ. నిర్గమింపరాని మార్గముల్ నైటుబ
జార్లు బార్లు నాంధ్రసంఘములను
రంగమెల్ల వెదకి రాజసగోవర
ఘుట్టములనుఁ గంటి తుట్టతుదకు.

మోహ.—అమ్మా! ఈదినమున మనకు నాన్నగారు కనఁబడుదురని చెప్పితివే! ఎక్కడ నున్నారో చెప్పవే! బతిమాలి నే నింటికి దీసికొని వచ్చెదనే.

అన్న.—నాయనా! విచారపడకు; మనము నాన్నగారికొఱకే యిక్కడికి వచ్చితిమి! ఇప్పుడే కనఁబడెదరు.

మోహ.—అమ్మా! నాకు నిద్రవచ్చుచున్నదే!

అన్న.—అయ్యో! నే నేమిచేయుదునురాత్రి! ఈకటికనేలపైననే పరుండెదవా! నాపైఁటకొంగుచే నీ వృక్షచ్ఛాయను శుభ్రపరచి పరచెదను. పరుండుము నాయనా! (అట్లుచేసి పరుండఁబెట్టి) అక్కటా! ఎట్టి యైశ్వర్యవంతునిబిడ్డని కెట్టిపాటు గలిగెను?

సీ. మృదుతల్పములయందు నిదురించు సుకుమారి
కటికరానేలల గడుపవలసె
వెలలేని భోజ్యముల్ వెక్కసం బగుబిడ్డ
యాఁకటిదప్పుల కడలవలసె
అడుగావలకు నిడ నడలుజెందెడుకూన
పరదేశములలోనఁ దిరుగవలసె
లాలితామూల్యచేలములు గట్టెడుకూన
కడుజీర్ణచేలముల్ గట్టవలసె
బంధుజనుల చంకఁబాయని మోహనుం
డకట! తండ్రిజాడ లరయవలసె

ఇట్టిపాటుఁ గాంచి యీ మొండిప్రాణ మేఁ
దాల్పవలసె! మేను నిల్పవలసె !!

(మోటారుబండి ధ్వని వినఁబడును.)

అన్న—ఎవరో విహారాసక్తులు కాఁబోలును మోటారుబండిపై నీవంక
కే వచ్చుచున్నారు. (అవకుంఠనమును సవరించుకొనును.)

[శంకరరావు- ప్రభావతితో మోటారుబండిమీఁద ప్రవేశము]

శంక—(బండిని నిలిపి) ప్రభావతీ! ఈప్రదేశము యోగ్యమై యున్నది
కొంతతడవు విచ్చట విశ్రాంతిఁ దీర్చుకొందము.

ప్రభా—మీయభిప్రాయప్రకారమే!

(ఇద్దఱును సుఖాసీను లగుదురు.)

అన్న—(భర్తనుఁ జూచి ఆశ్చర్యవిషాదములతో) ఏమీయద్భుతము!
నేను కలఁగనుచుండుటలేదు గదా! ఈవ్యక్తి నాహృదయాధి
నాథుఁడే యగునా? నాకన్ను లేమైన నన్ను భ్రమింపఁజేయు
చున్నవా?-కాదు; కాదు. ఆశ్చర్యములేదు. సంశయము లేదు.
ఈతఁడు తప్పక నామనోనాథుఁడే! ఓభగవానుఁడా! ఏమి నీలీ
లల పరమాద్భుతరహస్యము! ఎన్నినాళ్ళకీజీవచ్ఛవమునకు పున
శ్చైతన్యమును గలిగించితివి? ఆశ్చర్యకరమగు నీవిధానము నే
మని పొగడుదును?

సీ. అపరాధులైనట్టి హంతకులకుఁ గల్గు
నట్టి భీతిముఖమునందు లేదు
దేశసంచారియౌ దోషంబునం గల్గు
కల్మషాంబరములు గానరావు
జన్మస్థలంబును జాయాసుతులఁ బాయు
చింతయౌ హృదయానఁ జేరరాదు

అసహాయధనహీనదశయందుఁ బ్రభవించు
నాందోళనము మందునకైన లేదు
ఇట్టి సంతసంబు హృదయేశునకుఁ గూర్చి
నందు కోరమేశ ! వందనంబు;
కాని, యిచట నొక్క కాంతాలలామతోఁ
గూర్చినాఁడ వెంత క్రూరమతివొ ?

శంక—ప్రియా ! ప్రభావతీ ! నా యభిప్రాయమును వినిన పిదప నీవేమి యాలోచించితివి ?

ప్రభా—మనోహరా ! దీని కొఱకై యింత యాలోచన మేటికి? కాని, యొక చిన్నసందేహము మాత్రము నన్ను పీడించుచున్నది.

శంక—ఇంకను సందేహములు గలవా నీకు ? నా సాహసాచరణముల యెదుట నెట్టి యనివార్యసందేహము లున్నను, పటాపంచలై పోవలసినవే! తెలుపుము ఆసందేహ మెట్టిదో! ఒక లిప్తమాత్రంబునఁ దీర్చివేసెదను.

ప్రభా—మరేమియు గొప్ప సందేహముగాదు. నా శరీరమునందలి ఆభరణములన్నియుఁగలిసి యేబదివేలవఱకునున్నవి. అవియన్నియు, నాభర్తగారి యినుపమందసమునందే భద్రపరుపఁబడియున్నవి. అవి మనచేతఁ జిక్కినయెడల సుఖముగా నెందైనఁగాలక్షేపము చేయుట కనుకూలముగా నుండునని నా యభిప్రాయము.

అన్న—(స్వ)హా! దైవమా! నానాథున కెట్టి దుష్టబుద్ధిని గలిగించితివి?

శంక—(ఆలోచించి) సరే ! ప్రభావతీ! ఆయినుపమందసపుతాళపుచెవు లెవ్వరియొద్ద నుండును ?

ప్రభా—ఒకరియొద్ద నను నియామకము లేదు. గృహమునందే యొకచో భద్రముగా నుండును. నాకు వలసినయెడల నేను గైకొనుట కెవ్వరి యాక్షేపణము నుండదు.

శంక—అట్లయిన నీక మనసందేహములు విదాహము లైనట్లే. ఈ రాత్రియే నీభర్తనిద్రించువేళ వానిని తస్కరించెదను. రేపటి తెల్ల వాఱుజామున వేఁగుజీఁకటియందే కలకత్తా స్టీమరుపై మన ప్రయాణము. అర్థమైనదా ?

ప్రభా—ఈలోపల నాభర్త యేమాత్రమును అనుమానింపకుండ నుండునట్లు మాత్రము ప్రవర్తింపవలసియున్నది.

శంక—అందులకై నీకు సందేహ మక్కఱలేదు. ఆతనికన్నులలో కార మును జల్లుభారము నాది. ఇప్పుడు నాహృదయము పరమా నందభరితమైనది. (ముద్దిడుకొనును.)

(అనుబంధము-17.)

అన్న—(మొగము త్రిప్పుకొని శోకముతో) ఓభగవానుఁడా! ఎంత ఘోరము! తుదకు పరదారాపహరణప్రవీణుఁడగు నాభర్త దురాగతమును నాకంటఁబడవేయుటకొఱకా యిట్టిసమావేశ మును గల్పించితివి ? నే నీఘోరమును తిలకింపలేను. హా! పర మేశ్వరా! (మూర్ఛిల్లును.)

శంక } (విని ఉలికిపడుదురు.)
ప్రభా }

ప్రభా—హా! మనోహరా! పాప మెవ్వరో యబల కుమారునితో పా టుగ మూర్ఛనందియున్నది. భిక్షుకురాలని తోఁచుచున్నది. చూచివత్తమా ?

శంక—(స్వగతం) ఇది మాయన్నపూర్ణకంఠస్వరమువలె నున్నది అన్నపూర్ణ యిచ్చటకు వచ్చుట యెట్లు సంభవించును? నిజముగా నొకవేళ అన్నపూర్ణయే యైనచో మిగులప్రమాదము రాఁగ లదు. ఎట్లయినను దీని నిచ్చటనుండి సాగనంపితీరవలయును.

ప్రభా—ప్రియా! ఏమి యాలోచించుచున్నారు ?

శంక—ఇది నే నెఱింగినకంఠస్వరముగానున్నది. నేనొక్కఁడనే పోయి చూచివత్తును. నీ వంతదనుక మనకారులోఁ గూర్చుండుము. పొమ్ము. నే నిప్పుడే వచ్చెదను.

ప్రభా—చిత్తము. (పోఁబోవును.)

శంక—ప్రభావతీ! మాట. నీవద్ద నేమైన ధనమున్న నిట్లిచ్చిపొమ్ము.

ప్రభా—చిల్లరగా నేమియును లేదు.

శంక—ఎంతయున్నది?

ప్రభా—వేయిరూపాయలకాగిత మున్నది.

శంక—సరే. దాని నిటు తెమ్ము.

ప్రభా—(ఇచ్చును.)

శంక—నీవు వెళ్ళి కారులోఁ గూర్చుండుము. నే నిదే వచ్చెద.

ప్రభా—(నిష్క్రమించును.)

శంక—(దగ్గరకువచ్చి చూచి) సందేహము లేదు. అన్నపూర్ణయే! ఛీ—ఛీ—ఎంతఅపసవ్యకారణము! ఈపిశాచిని యిక్కడకుకూడ నన్ను వెంటాడి వచ్చి నాయానందమును పాడుచేయ సంకల్పించినదే? దీనికి కొంతధనమిచ్చి సాగనంపుటయే యుక్తమైనపని. (ప్రకా) అన్నపూర్ణా! అన్నపూర్ణా!

మోహ—(లేచి) అమ్మా! అమ్మా!

శంక—నాయనా! మీయమ్మ మూర్ఛిల్లినది. నీకొకపాత్రము నిచ్చెదను. ఆచెఱువులోనుండి జలముఁ గొనిరమ్ము.

(కారులోనిపాత్రము నీయఁగా బాలుఁడు నిష్క్రమించును.)

శంక—అన్నపూర్ణా! అన్నపూర్ణా!

అన్న—(లేచి) హా మనోహరా! ఎంతకాలమునకీ నిర్భాగ్యురాలికి దర్శన మిచ్చితిరి? (పాదములపైఁబడును.)

శంక—లెమ్ము. లెమ్ము. ఇది బహిరంగమైనయుద్యానవనము. ఈప్రదేశమందు నీ విట్టిచేష్టలుచేయరాదు.

అన్న—నాథా! చిరకాలసమావేశానంతరమున అగ్నిసాక్షిగా వివాహమైన నాస్వత్వమగుతమపై నే నీమాత్రపుచనవుఁ గైకొనుటకు దేశకాలములయాటంకము గల్గునా!

శంక—దాని కేమిగాని నీవిక్కడి కెట్లువచ్చితివి? ఎప్పుడువచ్చితివి?

అన్న—నాఁడు తమ రట్లు పలాయనమైనవెనుక మనఆస్తినంతయు మందిరముతోఁబాటుగ గంగారాముఁడు స్వాధీనపరచుకొనియెను. మీసోదరికిని, నాకును కృపాస్వభావుఁడగు కృష్ణమూర్తి శరణ్యుఁ డయ్యెను. చిరకాలము తమపోఁబడి నెఱుంగక కృశీభూతనై యుండి తుద కెవ్వరో చెప్పిన గాలివార్తవలన తమ రీపురమం దున్నట్లు విని సాహసించి వచ్చిన నాదోషమును సైరింపవలయును. తమ రిఁకనైన నావెంట స్వదేశమునకు రావలయు నని ప్రార్థించుచున్నాను.

శంక—ఎందులకు? హంతకుఁడ నను నేరముపై నురిదీయఁ బడుటకా?

అన్న—తమపైనుండి యానేరమును తప్పించునేర్పాటు చేయుదు ననియు, నందుల కెంతధనవ్యయమైనను వెనుదీయ ననియు, కృష్ణమూర్తి వాగ్దానముచేసినాఁడు.

శంక—నీతండ్రియే నాకు బలవద్వైరియై యున్నాఁడు. అతఁడు లంచముల కాశపడువాఁడు కాఁడు. నీ వెఱుఁగుదువుగదా! అందువలన నేమి లాభము?

అన్న—సాక్ష్యము మన కనుకూలముగా నున్నచో, నాతండ్రి యేమి చేయఁగలఁడు?

శంక—అన్నపూర్ణా! అందువలన నేమియు లాభములేదు. నీవును నాతోఁబాటుగ యీవిదేశములందు శ్రమనొందకుము. ఇంటికిఁ బొమ్ము. అదృష్టముండినచో నెన్నటికైనఁ గలిసికొనియెదను. నామాట విని మరలిపొమ్ము.

అన్న——నాథా! అన్యాయముగా, నన్నేటికి మభ్యపరచి మోసగింపఁజూచెదరు? ఎవ్వరో పెద్దమనుష్యుని మోసగించి ఆయనభార్యతోఁ గలిసి, వేఁగుజామున నే కలకత్తాస్టీమరుపైఁ బ్రయాణనిర్ణయమొనర్చుకొనుటను నేను వినలేదనుకొంటిరా? మరల నిట్టిమోసకృత్యము లొనర్చుచు కలుషజీవనమార్గముననే ప్రవర్తిల్లెదరా? ఇట్టి కార్యములు మనకు నిక్కముగఁ బ్రమాద జనకములు. నాథా ! నాథా ! ఈదాసురాలిప్రార్థనంబుఁ ద్రోసివేయకుఁడు.

(అనుబంధము-18.)

శంక——(స్వగ) ఛీ ! ఇది యెక్కడిపీడ దాపురమయ్యె నాకు ? ఐనను తొందరపడఁదగినసమయము కాదు. దీనికి ధనాశఁజూపి యావల కంపివేయుట క్షేమమార్గము. (ప్రకా) అన్నపూర్ణా ! ఇప్పుడు నీవేమియు నల్లరిచేయకుము. రేపటిదినమే కాకినాడకు జను నోడయొకటి కలదు. దానిపైన నీవు క్షేమముగా స్వదేశముం జేరుకొనుము. ఈరూపాయలను ఖర్చులకొఱకై దగ్గఱ నుంచుకొనుము. నేనును త్వరలో వచ్చి కలిసికొందును. (ఇచ్చును.)

అన్న——నాథా ! ఎంత భ్రాంతు లగుచుంటిరి ? ధనముచే తృప్తినంది మి మ్మీపాపకూపమ్మున వదలిపోవుటకు నేను నెలకాంత నని తలఁచితిరా ! అగ్నిసన్నిధానమున మీరు నన్ను వివాహమాడితిరి. సదా మీఛాయవలె మి మ్మనుసరించి యుండవలసిన దాననేగాని, నా కీధన మెందులకు ? భారతవర్షమున జనించిన పతివ్రతలకు ధవుఁడేగాని ధనము ప్రధానము గాదని విశ్వసింపుఁడు. నే నిట్టిధనము నెంతమాత్రమును లక్ష్యపెట్టుదానను కాను. (నోటును చింపి పారవైచి) మీసన్నిధానభాగ్యమునకై నే నిచ్చటికి వచ్చితిని. ఇంక విడువను. నన్నుగూడ మీవెంటఁ గొనిపొండు.

శంక—(కోపముతో) ఓసీ ! నిర్భాగ్యురాలా ! ఎంతపని చేసితివి ! వేయి రూపాయలను పాడుచేసితివిగదా ? ఛీ ! ఇంక నీకు సద్గతిలేదు. అధఃపతనమే గతి. నే నింక నీమొగము చూడను. నీవేమైనను సరియే. (పోఁబోవును.)

అన్న—(అడ్డమువచ్చి పాదములమీఁదఁ బడి) నాథా ! నాథా ! న న్నొంటరిగ విడచిపోవుట మీకు న్యాయముగాదు ! న్యాయముగాదు. (అనుబంధము-19.)

శంక—(అన్నపూర్ణ చేతిపై పొడుచును)

మోహ—(ప్ర) అమ్మా ! అమ్మా ! (ఏడ్చును.)

తెరలో—కౌన్ హై ! పకడో ! పకడో !

శంక—(పారిపోవును)

రమే—(భటులతో ప్రవేశించును.)

రమే—(అన్నపూర్ణ చేతికి కట్టు కట్టుచుండును.)

(తెరవ్రాలును.)

---

## రంగము- 2.

స్థలము:—గంగారాముని యిల్లు.

[నాందీబాయి కుమారునితో ప్రవేశము.]

నాందీ— (అనుబంధము- 20)

నాబిడ్డకూ, లోకంలోవున్న తక్కిన అందఱిబిడ్డలకూ, కొంచెము తేడా వున్నమాట నిజమే. అదేమిటంటే, లోకంలో బిడ్డ లందఱికీ తండ్రి ముందుగానే యేర్పాటై వుంటాడు. ఇఁక నాబిడ్డడికి పుట్టిన తరువాత గాని తండ్రిని సిసలుచేయడానికి వీలులేదు. మా అబ్బాయికి, నీవుతండ్రి విగాడుంటే బాగుంటుందని, యెవరినైనా అడగడం మంచిదేనా ! నాకే మీతో చకుండావుంది. అయినా అడిగిచూస్తాను; ఇందులోతప్పేముంది?

జయరాం—[ప్రవేశము.]

నాందీ—దర్వాన్ !

జయ—అరే భగవాన్ !

నాందీ—దర్వాన్ ! నాకొడుకును చూచావా ?

జయ—చూచానమ్మా- చూచాను. ఇది గంగారాంసేట్ అదృష్టం.

నాందీ—గంగారాంసేట్ అదృష్టం యిందులో యేమీా లేదు. ఇదంతా నా యదృష్టం.

జయ—మీాయిద్దఱిలో యెవరి అదృష్టమైనా ఒక్కటే. మీా కిద్దఱికీ కొడుకే కదా !

నాందీ—ఆఁ ! ఆఁ ! అది నే నొప్పుకోను. వీఁడు నాకొడుకే గాని గంగారాంసేట్ కొడుకుగాఁడు.

జయ—అయితే ! యీాబిడ్డకు తండ్రి యెవరని మీానమ్మకం ?

నాందీ—నాకూ అదే నమ్మకంలేకుండా వుంది. ఎవరినైనా ఒకతండ్రిని చేరమాఁడుదా మని చూస్తున్నాను.

జయ—అరే భగవాన్ ! లోకంలో యిలాటిబిడ్డలుకూడా వుంటారా !

నాందీ—దర్వాన్ !

జయ—భగవాన్ !

నాందీ—పోనీ గాని నేనొక సలహా చెప్పుతాను. వింటావా ?

జయ—వినఁదగినదైతే తప్పకుండా వింటాను.

నాందీ—పదిమందితో చేరముకన్నా ఇంటిలో కలిసి మెలిసి వుండే వాఁడవు- నువ్వెందుకు తండ్రివిగా వుండఁగూడదూ ?

జయ—అరే! భగవాన్ !

నాందీ—నీ కేదైనా సంబంధం వున్నా లేకున్నా నువ్వే ఈకుఱ్ఱవాఁడికి తండ్రివి. తెలిసిందా ! ఇంకంతే; సేఠాణీగారి ఆజ్ఞకు తిరుగు లేదు. ఇదుగో ! పిల్లవాని నెత్తుకో ! నేను మళ్ళీ వచ్చిందాకా నీదగ్గరే ఉంచుకో !

జయ—పిల్లవాఁ డేడిస్తే?

నాందీ—ఏడిస్తే. పాలిచ్చి సముదాయించు.

జయ—నాదగ్గర పా లెక్కడివి! పాపాలు.

నాందీ—పాలు లేకుంటే డబ్బాపా లియ్యవచ్చును.

(నిష్క్రమించును.)

జయ—అరే! భగవాన్- ఇ దెక్కడి సంసారమురా బాబూ!

(పిల్లవాఁ డేడ్చును.)

జయ—అరే బచ్చా ఛూప్- (ఏడ్చును.) అరే ఛూప్‌రే ఛూప్!

గంగా—అరే దర్వాన్!

జయ—అరే భగవాన్!

గంగా—రాధాబాయి యెక్కడుందీ! దానికి కాపలావుండుమంటే మానివేసి, నీవు వేరే ఉద్యోగములో ప్రవేశించా వెందుకూ?

జయ—సేఠాణీ ఈపిల్లవాణ్ణి నా కప్పగించింది.

గంగా—పిల్లవాణ్ణెత్తుకోవడం కూడా ఒక వుద్యోగమేనా?

జయ—ఈరోజుల్లో తాసీల్‌దార్ల అర్దెండర్ల కదే వుద్యోగము.

గంగా—వీణ్ణి నేను చూస్తాను. నీవు తక్షణం రాధాబాయిదగ్గర కాపలావుండు.

జయ—(నిష్క్రమించును.)

(బాలుఁ డేడ్చును.)

గంగా—అరే బాబా! ఛూప్ రహెూ. ఛూప్ రహెూ.

(బాలుఁడు మరింతయేడ్చును.)

శంక—అరే! తేరేపాం పకడ్తాహుం. తేరేకు సలాం కర్తాహుం. ఛూప్ బాబా- ఛూప్- (ఏడ్చును) అరె అరె బడీ ముష్కిల్కా కామ్ హై! అభీ మైక్యాకరుం! అరే దర్వాన్- బచ్చా రోతాహై దర్వాన్ (బాలుఁ డేడ్చును.)

గంగా—(కోపముతో) అరే సువ్వర్కా బచ్చా ఛూప్ (కొట్టును బాలుడు మరింత యేడ్చును.)

గంగా—అరే ఖుదా! మై క్యాకరుం! అరే దర్వాన్! ఇదరావ్ యాంవ్‌- బచ్చా రోతాహై దర్వాన్ !

జయ—[ప్రవేశము] అరే భగవాన్ ! అర్చి అర్చి హైరాన్ అయిపోయినానాని బాబూ ! ఈపిల్లవాణ్ణి లోపల్కి తీస్కెళ్ళి తల్లికిచ్చేసిరా ! వెళ్ళు.

జయ—సేట్‌జీ ! తమ కొకఉత్తర మొచ్చింది.

గంగా—ఇచ్చేసి వెళ్ళు. వేగిరంగా మళ్ళీ రావాలిసుమా !

జయ—(బాలునితో నిష్క్రమించును.)

[తిరిగి ప్రవేశము.]

గంగా—(ఉత్తరము విప్పి చదువును.)

శ్రీరస్తు.

"భయంకర వీరదుర్గామహాశక్త్యై నమః

గంగారాంసేట్‌గారి సన్నిధికి-

మీయింటిని మీకుమార్తెను ఆశ్రయించిన భూతం వ్రాసేదేమనగా-"

గంగా—అరే బాబూ ! భూతంవ్రాసిన ఉత్తరమా ! భూతము అంటే?

జయ—భూతం అంటేనా ? సైతాన్ !

గంగా—అరే దర్వాన్ !

జయ—అరే భగవాన్ !!

గంగా—ఈదయ్యపుత్తరం చూస్తే నాగుండె దడదడ లాడుతుంది. దీన్ని చదివి వినిపించు.

జయ—(చదువును.)

"నేను నీకుమార్తెయైన రాధాబాయిని ఆశ్రయించి వున్నాను. నేను మగభూతాన్ని. నీకుమార్తెమనస్సు జయరాం అనే వాడిమీద

వున్నది. వాఁడికి రాధాబాయి నిచ్చి వివాహం చేస్తేనీకుమార్తెను వది లేస్తాను. ఇఁక నీయింటికెందుకాశ్రయించుకున్నానంటే, నువ్వు అన్యాయంగా శంకరరావుల ఆస్తిని అపహరించావు. ఆపాపపుఆస్తిని నువ్వువొదిలించుకుంటే నీయింటినివొదలిపోతాను. ఈరెండుపనులలోనువ్వు ఏదిమానినా నిన్నూ,నీకూతుర్నీ, నీకుటుంబాన్నీ నాశనం చేస్తానని తెలుసుకో!

జయ్ భేతాళభూతరాం

ఓం-హ్రీం-హ్రైం-హ్రూమ్-హుమ్-ఫట్."

గంగా—(భయముచే వణఁకుచు) అరే దర్వాన్ !

జయ—అరే భగవాన్ !

గంగా—అరే దర్వాన్ !

జయ—అరే భగవాన్ .

గంగా—దర్వాన్ !

జయ—భగవాన్ !

గంగా—దర్వాన్ !

జయ—సైతాన్ !

గంగా—అరే దర్వాన్ !

జయ—అరే సైతాన్ !

గంగా—(కొంచెముతమాయించుకొని) ఇప్పుడేమిచేయుమనినీసలహా ?

జయ—సందేహమేమి? సైతాన్ వ్రాసినట్టే.

గంగా—సైతాన్వ్రాసినట్టు ఒక్కనాడు చేసేవాఁడనుగాను. భూతవైద్యము చేయించి సైతానును వెళ్లగొట్టిస్తా.

జయ—ఆపనిచేస్తే చాలా బాగుంటుంది. వెళదాం రండి.

(ఇరువురు నిష్క్రమింతురు.)

———

రంగము—3.

స్థలము:-రమేశ మందిరము.

[విశ్రాంతి నందియున్న అన్నపూర్ణయు, రమేశబాబు, మోహనరావు ప్రవేశము.]

రమే—బాబూ ! నీపేరేమి ?

మోహ—మోహనరావు.

రమే—నీతండ్రిపేరు జ్ఞాపక మున్నదా బాబూ ?

మోహ—శంకరరావుగారు.

రమే—శంకరరావుగారా ! (తల పంకించి) సరియే! నాయనా! మీరిది వర కేయూరిలో నుండువారు ?

మోహ—కాకినాడలో.

రమే—ఇక్కడికి వచ్చి యెన్నాళ్లయినది ?

మోహ—ఏమో ! కొన్నాళ్ళయినది.

రమే—సరే, పోనిమ్ము. ఆయమ్మ నీతల్లియేనా ?

మోహ—ఔను.

రమే—పేరేమి ?

మోహ—అటువంటిమాట మీ రడుగవచ్చునా ?

రమే—(చిరునవ్వు నవ్వి) నీబుద్ధికి సంతసించితినిగాని నాయనా ! నేను నీకు తాతయ్య నగుదును. తప్పులేదులే- చెప్పుము.

మోహ—అన్నపూర్ణమ్మగారు.

రమే—(ఒక పాత్రనుదెచ్చి) దీనిని నీ కెవ్వ రిచ్చినారు !

మోహ—ఒకపెద్దమనుష్యుఁడు. "మీఅమ్మ మూర్ఛపోయినది- మంచి నీళ్ళు తె"మ్మని నా కిచ్చినాఁడు.

రమే—ఆపెద్దమనుష్యుఁడు నీతండ్రిగారివలెనున్నాఁడేమో చూచితివా ?

మోహ—ఏమో- నాతండ్రిగారిని గుర్తుపట్టలేను.

రమే—ఆపిచ్చిమనుష్యునివెంట నింకొకస్త్రీ యెవ్వతెయైన నున్నదా?

మోహ— లేదు.........కాదు, కాదు. ఉన్నది- దూరముగా కారులో నున్నది.

రమే—సరే; నీ వాడుకొనుము నాయనా !

మోహ—తాతయ్యగారూ! మానాయనగారు నాకు కనఁబడరా?

రమే—నేను చూపించెదను. నాయనా ! భయపడకుము.

మోహ—(నిష్క్రమించును.)

రమే—(స్వగతం) ఈమె శంకరరావుభార్యయు, ఈబాలుఁడు కుమారుఁడు ననుటకు సందియము లేదు. ఔరా ! ఎంతక్రూరుఁడీశంకరరావు. ఇతఁడు నాభార్యతో యేకాంతవిహారము లారంభించి స్వభార్యను కత్తిచే పొడిచినాఁడే! ఎంతసాహసి యనవలయు నీతని ! ఇం కేమిక్రార్యము తలంచినాఁడో ! వీనిప్రవర్తనమును రహస్యముగా కనిపెట్టవలసి యున్నది. అదిగో కాలిచప్పుడగుచున్నది. వాఁడే యైయుండును. నేనిందుదాగి పరికించుచుండెదంగాక ? (చాటునదాగును.)

[శంకరరావు ప్రభావతితో ప్రవేశించును.]

శంక—(అటునిటు పరికించి) ప్రభావతీ ! ఇప్పుడిచ్చట నెవ్వరును లేరు. మనము తలంచినకార్యమున కింతకన్న మంచితరుణము దొరకదు. ఇనుపపెట్టెతాళపుచేతులను నాకు శీఘ్రముగా నిమ్ము.

ప్రభా—(ఇచ్చి నిష్క్రమించును.)

శంక—(పెట్టెను తెఱచి ఆభరణములను దొంగిలించుచుండును.)

రమే—(ప్ర-) ఓరీ ! చోరశిఖామణీ ! ఎందుఁబోయెదవు ! నిలువుము. కృతఘ్నుఁడా ! అపాయస్థితిలోనుంటివని దయదలఁచి, చేరఁదీసి, నాతోడ సమానమగు ధనాధికారముల నొసంగి, యధికార్లతో

నీకొఱకై విరోధముంగూడ త్రివ్వి తలకెత్తుకొనిననాకు నీవొనరించినప్రత్యుపకారమంటరా యిది! కుటిలహృదయా! కాలసర్పమువలె నాయింటఁ జేరి నాభార్యను నాధనమునే యపహరింపఁ దలఁచితివా! పాపాత్ముఁడా! కులనాశకా! ఇంక నీకెట్టిపాట్లు గల్గించెదనో చూడు.

శంక—మహారాజా! తొందరపడకుఁడు; శాంతింపుఁడు. రక్షించినవారు భక్షింపఁదలఁచు టుచితమగునా! తమరు పెద్దవారు; దయాసముద్రులు. ఒకవేళ మావంటిపిల్లలు అవివేకంబున దోషమే చేసినను క్షమింపవలయును. కాని యింతయాగ్రహము చూపిన యెడల బ్రదుకఁగలమా!

రమే—ఛీ! దుష్టుఁడా! నిన్నింకను క్షమింపవలయునా! నీయెడ క్షమాగుణముఁ జూపుట కొఱవితో తలగోకికొనుటఁగాదా? పాపమతీ! నిన్నేమిచేసిన పాపమున్నదిరా? హంతకుఁడవై విదేశముల పాలగుటకు సిగ్గునొందక ఆదరించినవానిభార్యను చేరఁదీసి ధనమానముల నపహరించినది చాలక స్వభార్యను కత్తిపోటునఁ బడవేసిన చండాలుఁడవు? నీయందా దయదలంచుట? బుద్ధిహీనుఁడనై యిదివఱకు చెడితిని కాని యిఁక నీకు తరుణోపాయము లేదు. ఇప్పుడే నిన్ను రాజభటుల కప్పగింతును.

శంక—(తుపాకిని జాగ్రత్తపఱచి యుంచుకొని) అట్లయిన నన్ను క్షమింపఁదలఁచుకొనలే దన్నమాట.

రమే—క్షమాపణ యనుమాటను నాయెదుట నెత్తకుము. ఇదివఱకు హంతకుఁడవు, జారుఁడవు, కృతఘ్నుఁడ వైతివి. ఇప్పుడు చోరుఁడవుగూడ నైతివి. నీమొగముచూచిన మహాపాతకము.

శంక—అన్నదాతవు. క్షమింపుము; క్షమింపుము. ఆగ్రహ మపాయకరము సుమా!

రమే—ఆఁ! ఏమిరా! తుచ్ఛుఁడా! నను బెదరింపఁ జూచుచున్నావా?

శంక—బెదరించెదనా?

రమే—కాకున్న నీ వేమిచేయఁగలవు?

శంక—ఖూనీ చేసెదను.

రమే—ఆఁ! ఎవరిని?

శంక—నిన్నే ఖూనీచేసెదను. నీ లెక్కమాత్రమేమి? (తుపాకితోఁ గొట్టును.)

రమే—(దెబ్బతగిలి పడిపోవును.)

(తులసీరావు పోలీసులతోఁ బ్రవేశించును. శంకరరావు ప్రభావతితోఁ పాఱిపోవును. పోలీసులు వెంటాడుదురు.)

[సీను ట్రాన్స్ఫర్ అయినది. నదిమీఁద వంతెన కనబడును. శంకరరావు, ప్రభావతి వంతెనమీఁద రెండవవైపున కేగుదురు. శంకర రావు వంతెనను విఱుగఁగొట్టును. పోలీసులు రెండవవైపున నుందురు. శంకరరావు ఒక్కొక్కనినే తుపాకితోఁ గొట్టి పడవేయును. తుదకు తులసీరావు మిగులును. శంకరరావు తుపాకి పట్టెదగును.]

(తెర మెల్లగ వ్రాలును.)

చతుర్థాంకము.



# రంగూన్ రౌడీ

అను

## పతిభక్తి.

---

పంచమాంకము.



### రంగము—1.

స్థలము:—విజయనగరములో.

[సారాయిబుడ్డి చేతఁబట్టుకొని, శంకరరావు ప్రవేశించును.]

శంక— (అనుబంధము - 21.)

తెలివిలేని ముసలిబ్రహ్మ ఒకసారి మానవునినుదుట లిఖించకనే యుండవలయును. లిఖించినయదృష్టరేఖను తుడిచివేయు వానికిమాత్రము సాధ్యమగునా ! (మీసము దువ్వుచు) భ్రీ ! శంకరరావ్ ! నీయదృష్ట మసామాన్యమైనది. దానికి చలనములేదు. ఈ ప్రపంచమునందలి మానవమాత్రుం డెవ్వఁడును నీయదృష్టజ్యోతిని తేరిచూడఁజాలఁడు.

సీ. జనకునిస్వార్జితం బనుభవింపగనీని
పవరుదారును నేలపాలుచేసి
బంధింపవచ్చిన శ్వశురు మోసముఁజేసి
సాగరంబునఁ బడి చావకుండ
తనయిల్లుజేర్చిన ఘనునికన్నులలోన
కారముఁజల్లి తత్కాంతవలచి
వెదకుచు నావెనువెంటనే వచ్చిన
యాత్మదారనుసైత మవల ద్రోసి

నను బట్టఁగాఁ దలంచిన రమేశుని నాకు
భయదశతఘ్నికిఁ బాలొనర్చి
వెంటఁ దవిలిన పోలీసు వితతి నెల్ల
లెక్కకును మిన్నయగు వారి నుక్కడంచి
యిపుడు లక్షాధికారినై యింపుఁ జేరి
నట్టి నను బట్ట దేవునియబ్బ తరమె ?

ఆనాఁడు పోలీసుభటులను హతమొనర్చిన సందర్భమున నాతుపాకిలోని గుండ్లన్నియు సంపూర్తిగొందుటచేత దుర్మార్గుఁడగు నామామ బ్రదికి పోయె. ఊఁ- ఐననేమి! ఎప్పుడో యొకనాడు వాఁడుమాత్రము నాతు పాకిదెబ్బకు హతముగాక పోవునా? నేనీవిజయనగరంబున, వేషభాషల నన్నిటినిఁ బరిపూర్ణముగా మార్చుకొనియున్నవార్తను గ్రహింపఁగల ఘనుఁడెవ్వఁడు? ఒకవేళ నెవ్వఁడైన నున్నను, వాఁడుగూడ చచ్చినవారిం జూడఁబోవఁడా! ఈశంకరరావు నెదుర్కొన నెవ్వరికి గుండె లున్నవి! ప్రభావతియొక్కతె నాచర్యల నిప్పుడు కంటగించుకొనుచున్నట్లున్నది. కంటగించి యీయాఁడుముండ శంకరరావు నేమిచేయఁగలదు? ఏడ్చి ఏడ్చి చచ్చుఁగాక. నాస్వేచ్ఛను దీనికొఱకై చంపుకొందునా! ఇష్టమువచ్చిన కాంతలతో నానందము ననుభవింపకుండ నా కిదియొకయాటంకమా! (విని) అదిగో! ఇక్కడికే వచ్చుచున్న ట్లున్నది! రానిమ్ము. ఈలోన కొంచెము సురాపాన మొనరింతును. (త్రాగుచుండును.)

[ప్రభావతి—ప్రవేశించును.]

ప్రభా—(చూచి స్వగతము) ఛీ! ఏమి యీరాక్షసప్రకృతి! ఇరువదినా లుగుగంటలును సురాపానము దక్క వేఱొకవృత్తియే కనుప డదే! ఈనికృష్టునినైజ మెఱుంగలేక, యెంతపొరపడి గృహాన్తర్గ మొనరించి వచ్చితిని! (వేఱొకయాసనముపై విముఖియై కూ ర్చుండును.)

శంక—ఓహో! ఏమి మాదురదృష్టము? మాప్రభావతీరాణిగారికి నేఁడు సంపూర్ణాగ్రహము గలిగిన ట్లున్నదే?

ప్రభా—నీకు నాయాగ్రహముతో పనియేమి? అనుగ్రహముతో పని యేమి? నావంటిరాణులు నీకు వేనవేలు గలరు.

శంక—(వికటహాసము చేసి) ఓహో! ఇదియా కథ! నిన్ను వదలి నే నితరస్త్రీలతోఁ బోవుచుంటినని యీర్ష్యయా? ప్రభావతీ! నీవు నాకు తాళిగట్టినభార్యవును, వారు కానివారునా! అందఱు నొక్కటే. అందుల కీకడుపుమంటయేల!

ప్రభా—తాళిగట్టినభార్య నింతకన్న సుఖపెట్టి యేడ్చితివా యేమి?

శంక—(పెద్దగా నవ్వి) అద్దీ సంగతి! నిజము గ్రహించితివి. స్వంతభార్యయే నాకు లెక్కలేనపుడు, నీవంటిసానులను లెక్కింతునా!

ప్రభా—(రోషముతో లేచి) ఛీ! దుర్మార్గుఁడా! ఏమిరా! ప్రేలితివి. నేను సాని నటరా!

శంక—సానివిగాక పతివ్రతవా యేమి! మగని విడచి, యితరపురుషుని మరగి యిల్లు విడచివచ్చినఱంకులాడికిని సానికిని భేద మేమి?

ప్రభా—(విచారరోషములతో తల మోదుకొని) హా! హా!! ఎట్టి దుర్మార్గుని విశ్వసించి ధనమానప్రాణము లర్పించి, గృహత్యాగినైై యెట్టి నిందావాక్యములను సహింపవలసివచ్చెను? దుర్భరము! దుర్భరము! భరింపఁజాల! (రోషముతో) ఓరీ! దుర్మార్గుఁడా! కులభ్రష్టుఁడా! హంతకుఁడా! నాసంసారచ్ఛేదముఁ గావించి, నన్నధఃపతితురాలి నొనరించినది చాలక యెట్టిదుర్భాషలాడ సాహసించితివిరా చెనటీ!

సీ. మరణింపనున్న నిన్నరసి రక్షించి నా
యిలుజేర్చినందుల కిదిఫలంబ?

ధనమానములు ప్రాణధనము నీ కర్పించి
మది నమ్మినందుల కిదిఫలంబ?
ప్రాణేశ్వరుని గడ్డిపరకగాఁ బోనాడి
యిటు వచ్చినందుల కిదిఫలంబ?
ఏబదివేల్ జవాహిరి నయాచితముగ
నిచ్చి నమ్మినదాని కిదిఫలంబ?
ఈమహైశ్వర్యముల కెల్ల నిదిఫలంబ?
మదిని నిను విశ్వసించుట కిదిఫలంబ?
ఏరుదాటి తెప్పనుగాల్చు క్రూరబుద్ధి
వని యెఱుంగక చెడితినిరా! దురాత్మ!

శంక—(కొంచెము సురాపానము చేసి) ఓసీ! ప్రభావతీ! కడుపెద్ద యుపన్యాసము నిచ్చి యలసిపోతివి గాని, చాల పొరఁబడితివి. నీవు చెప్పినవానికి గాదు సుమా యీఫలము! కాక ఏమంటివా! నేను చెపెద్దపద నాలకింపుము.

సీ. పెండ్లియాడినభర్త కండ్లకు మసిఁబూసి
యిలు వీడి వచ్చుట కిదిఫలంబు
భవితవ్యమునవచ్చు పాట్ల నెఱుంగక
మదమెక్కినట్టి నీ కిదిఫలంబు
మగని ప్రాణము అంకుమగఁడు దీయుచునుండ
నీక్షించినట్టి నీ కిదిఫలంబు
మోహాంధకారవిమూఢవై జారిణీ
కృత్యంబు చేయుట కిదిఫలంబు
అందమునకు మిగుల హానినిఁ గూర్చెడు
హీనగుణము లుంట కిదిఫలంబు
విధి లిఖించినట్టివిధమును మార్ప నీ
తరమె! వట్టివెఱ్ఱితనము గాక.

ప్రభా—(శోకభారముతో) హా! హా! దురాత్ముఁడా! కృతఘ్నుఁడా! సిగ్గులేక మెట్టిశ్రీరంగనీతులం జెప్ప సాహసించుచుంటివిరా! పలువా!

శంక—బస్! బస్! చాలు-చాలింపుము. దూషించి అల్లరిచేసి తిట్ట నారంభించితివా, నీమగనితోఁబాటు నాతుపాకిదెబ్బకు హతము గాఁగలవు. జాగ్రత్త. సమ్మతియగునా చచ్చినట్లు పడియుండుము. బ్రతుకనెంచితివా మఱియొకమగనిఁ దగుల్కొని పొమ్ము. నా యభ్యంతరము లేదు.

ప్రభా—హా! భగవంతుఁడా! తుదకు నాగతి యింతవఱకుఁ దెచ్చితివా! ఇంక నే నెందుఁబోవుదును! నా కేదిదారి! మరణింతమన్నను యీపురమున సాగరము గాని, నది గాని లేదే! ఈదుర్భరజీవనమున చేఁజేతల చేసికొనినపాపఫలం బనుభవించుట కెన్నినాళ్ళింకను బ్రతుకవలసియున్నదో కదా! పరమేశ్వరా! పుణ్యాత్ముఁడైన భర్తను చంపించినపాపఫలం బూరక పోవునా! అనుభవింపవలయు! అనుభవింపవలయు. ఒకరి నేల యనవలెను? పాపమంతయు నాది - పాపఫల మంతయు నాది; - పాపఫలపరిణామమంతయు నాది!-ఈకృతఘ్నుని దూషించిన ఫలమేమి! ఈతఁడు నాపాపములను నాకన్నులకుఁ గట్టి ప్రబోధితం జేసినాఁడు. ఛీ! పాపప్రపంచకము - ఇంక నీలోకమున పుణ్యపాపములకు విభేద మెక్కడ! నాపతివంటిధర్మాత్మునకు ఘోరహత్యయు, వీనివంటి పాపాత్మునకభ్యుదయమునా! నా కీపాపలోకముతో పనిలేదు. తుచ్ఛమైన యీకామసౌఖ్యములతో పనిలేదు. ఈ యైశ్వర్యముతో పనిలేదు. చేసినపాపములకు పరిహారముగా పరమేశ్వర ధ్యాన మొనర్చుకొనుచు, జీవితశేషమును గడిపివేయఁజాలనా! ఓపరమేశ్వరా! నీ దాసురాలను. పాపకూపమునుండి కన్నుల

దెరచితిని. నీయనుగ్రహజ్యోతిం బ్రదర్శించి నన్ను సన్మార్గమునం బ్రవేశపెట్టుము.

ఉ. కామము రెండుకన్నులను గప్ప వివేకము లేక దుష్టనై
పామరబుద్ధిచే నఖిలపాతకముల్ తలదాల్చినాను స్వా
మీ! మనఁజాల నీధరణి నీప్సితముల్ త్యజియించి నిన్ను నా
స్వామి వటంచు నమ్మితి విపన్నను నన్ను తరింపఁజేయవే!

శంక—ఓహో! జారిణి యిఁక సన్న్యాసిని యగును కాఁబోలును. చింతామణీచరిత్ర మేమైనఁ జదివితివా యేమి?

ప్రభా—ఛీ! పాపీ! నీయిచ్చవచ్చినట్లు ప్రేలుకొనుము. నీమొగముఁ జూచిన మహాపాతకములు చుట్టుకొనును.

శంక—(నవ్వి) ఆగ్రహింపకుము. ప్రభావతీ! ఆగ్రహింపకుము. ఇంతయాగ్రహము గలదానవు యోగిని వెట్లయ్యెదవు?

ప్రభా—(స్వగ) వీఁడు నన్ను నిందించుచున్నను, నాతరణోపాయమునకుఁ దగినట్లు జ్ఞానప్రబోధమే చేయుచున్నాఁడు.

శంక—ప్రభావతీ! అందులకుఁగాదు. నేను చెప్పఁబోవున దేమనఁగా! యోగినులకు రత్నహారములు, చీనిచీనాంబరములు ఉపయుక్తములు కావుగదా? రుద్రాక్షలును జేగురుగుడ్డలును ధరించుటమాని నీవు సర్వాభరణములతో నన్ను వదలిపోవుటలో నీయభిప్రాయ మేమా యని-ఒకసారి జారిణివైతివి కావున నీగుణమునందు నాకు సందేహము గల్గుటచే నవ్వు వచ్చినది.

ప్రభా—(స్వగ) ఆహా! ఎట్టిజ్ఞానప్రబోధ! (ప్రకా) నిజమే. శంకరరావు! నీవన్నమాటనిజమే! నా కీయాభరణములతో పని లేదు. ఇంక వీనినిమాత్రము నే నేమిచేసికొందును? ఈయైశ్వర్యమంతటితోపాటుగా నాశరీరాభరణములను గూడ గైకొని నీవే యనుభవింపుము.

(తీసియిచ్చును.)

శంక—(కపటముగా) ఆ! ఆ! నిజముగా తీసివేయుచుంటివా యేమి? వలదుసుమా! వలదు సుమా! వలదు. ఊరక పరిహాసమున కంటిని గాని, నిజమని నమ్మితివా! ఈదినమునఁ గలిగినవిరక్తి రేపు గలుగునా? వట్టిమాట- (ఆభరణములు తీసికొనును.)

ప్రభా—(స్వగ—ఆహా! ఇప్పటికి ఐహికాశాబంధములతో సంబంధము పూర్తిగఁ దీరిపోయినది. ఆత్మసన్యాసినైతిని. ఓ జగదీశా! నీపాలిటికి వచ్చుచున్నాను. పాపాత్మురాల నగు నన్ను క్షమింపుము; అనుగ్రహింపుము.

చ. అవనిని నన్నుఁ బోలిన మహాదురితాత్ములు వేనవేలు నీ
ప్రవిమలసత్కృపానిరతి బంధములం బెడఁబాసి పాపసం
భవమగు నీభవానల మపారముగాఁ దరియించినారు; మా
ధవ! కరుణింపవే! కలుషకర్మవిపాకము నాశమొందఁగన్.

శంక—(స్వగ) చేఁ జిక్కవలసిన దంతయుఁ జిక్కినది. ఇంక నీయలుకు పిడచతో నా కేమిపని! క్లబ్బునకు వేళయైనది. నేఁ బోవలయు నేడ్చియేడ్చి యిది యెందైన నరుగుగాక!

(అనుబంధము - 22.)

(నిష్క్రమించును.)

[ఒక బట్లరు ప్రవేశించును.]

బట్ల—ఏమమ్మా! శంకరరా వెక్కడ?

ప్రభా—అయ్యా! ఇంతకుముం దిందే యుండెను. ఇప్పుడే యెచ్చటికో పోయెను. అతనితో నీ కేమైన పని యున్నదా?

బట్ల—పనియా! ఔను పనియే యున్నది.

ప్రభా—అతఁ డింట లేన ట్లున్నాఁడు.

బట్ల—అతఁడు లేకున్న నీవైన మాబాకీ యీయక తప్పదు.

ప్రభా—అయ్యా! ఎక్కడి దాబాకీ?

బట్లు—ఎక్కడిదా ! మాహోటల్లో నీమగఁడు మతిలేకుండ త్రాఁగిన బ్రాందితాలూకుబాకీ - తిన్న కోడిమాంసపుపులావుపేట్లతాలూకుబాకీ - అర్థ మైనదా ?

ప్రభా—కావచ్చును. అట్లయిన న న్నేమిచేయుమందువు ?

బట్లు—ఏమైనను చేయవలెను. మాబాకీధనమును నిలుచున్నపాటున క్రక్కి తీరవలెను. తెల్లవాఱేసరికోడనే పంపెద నని చెప్పి వెళ్లినాఁడే! జ్ఞానము లేదా వానికి? ఇప్పటి కాఱుదినములు దాటెను మేము పెద్దమనుష్యుఁ డనుకొని, నిర్బంధింపలేము. ఇదియా నీమగనిమర్యాద !

ప్రభా—ఆడుదాననైన నాతో నీవు నిష్ఠురములాడిన లాభ మేమి నాయనా ?

బట్లు—చాలు చాలు ! చిలుకపలుకు లావెనుక నెన్నైన నాఁడుదువుగాని ముందుగా నాబిల్లు ఫైసలు చేసి పంపుము.

ప్రభా—అయ్యా ! న న్నేల తర్జనభర్జనములు చేసెదవు ?

బట్లు—ఇదిగో ! నే నీమెత్తనిమాటలకు మోసపోయి వదలిపెట్టి వెళ్ళువాఁడను గాను. మంచిమాటలతోడబ్బిచ్చితివా సరే ! లేదా-నిన్ను ఆడుదాన వని కనికరించువాఁడను గాను. నడువీధిలోనికీడ్చి అల్లరిపెట్టి నాడబ్బును వసూలుచేసుకోఁగలను. ఆడుదానవుకనుక నే యింతవఱకు కనికరించితి ననుకొనుము.

ప్రభా—అయ్యా! నావద్ద దమ్మిడియైనలేదు. నావద్ద నేమితీసికొనెదవు?

బట్లు—ఓహోహో ! చాల మెలకెలనముగ నున్నదే వ్యవహారము ! నేను చెప్పుచున్నాను వినుము. వట్టిమాటలవాఁడను కాను. అన్నంత పనియుఁ జేసితీరుదును. తుదకు నాధన మెట్లును రాకపోదు. కాని యాఁడుదానవు, అల్లరిపా లగుదు వని విచారించుచున్నాను.

ప్రభా—నాయనా! నావద్ద ధన మేమియును లేదు. నే నసృతములాడను

దానను గాను. విశ్వసింపుము. నామర్యాదఁ దీసిన నీకు వచ్చు పుణ్యమేమి ?

బట్ల—ఊఁ! పుణ్యము!- పాపము!- పాపపుణ్యములుచూచుకొనినచో నొక్కనాఁడైనను మే మీవృత్తి చేయఁగలమా ! విను విను, మెల్లఁగా చెప్పినప్పుడే దారికి వచ్చుట మంచిది. వ్యవహారమును ముదురనిచ్చిన లాభము లేదు సుమా !

ప్రభా—(స్వగ) ఆహా! ఇ దెట్టిపాటు వచ్చె నాకు! సర్వసంగపరిత్యాగము చేసికొనినను నాపాపఫలము పెనుభూతమై నన్ను వెంటాడుచున్నదే! ఏమిచేయుదును? (ప్రకా) అయ్యా! నావద్ద నే నిప్పుడు ధరించియున్నపట్టుచీరతప్ప వేఱు ధనమేమియును లేదు. దీనిని కొనిపోయి నీఋణముఁ దీర్చుకొన సంగీకరించితివా సంతోషముతో నిచ్చెదను.

బట్ల—అట్లే. నే నీసంగతి నాయజమానునితోఁ జెప్పి, అతఁ డంగీకరించినచో తీసికొనివెళ్ళెదను. నేను వచ్చువఱకు నీ విందే యుండవలయును.

ప్రభా—మంచిది; నాయనా ! వెళ్ళి రమ్ము.

బట్ల—(నిష్క్రమించును.)

ప్రభా—విచార మెందులకు. ఏప్రాణి కేక్షణమున కేస్థితి రావలయునో యవశ్యము వచ్చితీరును. అదిగాక యోగినినైన నాకీ చీనిచీనాంబరము లేల? పరమేశ్వరుఁడు నాయం దనుగ్రహము గలవాఁ డగుటచేతనే యీపరిస్థితినిఁ గల్పించెను.

సీ. యోగినినైన నామొడలికి చీనాంబ
రము లేల ? కాషాయ మమరుఁగాని
జటినైన నామేన సవరింప నగరు చం
దన మేల ? భస్మచందనమెగాని

సన్యసించిన నాకు శస్త్రభూషణ మేల ?
రుదురాక పేరులే కుదురుఁగాని
తపసినా నాకు మదనమంత్రజపమేల?
నారాయణస్మరణంబె కాని
గీ. కరమునందాల్ప నాకు శృంగార మేల?
పూజితంబైన జపమాల పోలుఁగాని
ఇన్నిటి నెఱింగి యీశ్వరుం డిట్లు సేయ
వగవ నేల? నానందింపఁ దగును గాని.

బట్లు—[ఒకచీరతో ప్రవేశము.]

పరిభా—నాయనా! నీయజమాని నావిన్నపమును మన్నించెనా?

బట్లు—మన్నించెను. నీవు ధరియింప నీచేలమునుఁగూడ పంపెను. దీనిని మేనఁదాల్చి దానిని నాకిమ్ము. (ఇచ్చును.)

పరిభా—(కైకొని కన్నుల కద్దుకొని) నాయనా! ఇప్పటియవస్థ కీచేలమే నాకు మిక్కిలి యర్హమైనది. భగవంతుఁడే దీనిని నీమూలమున నాకు దయచేసినాఁడు. నీకు చిరాయుష్యము గల్గుఁగాక! (చీరను గొని చాటున కేగును.)

(తెర వ్రాలును.)

---

## రంగము—2.

స్థలము:—గంగారాం సేట్ గృహము.

[గంగారాముఁడు రక్షరేకులుగట్టుకొని కుర్చీమీద పండుకొని]

గంగా—దర్వాన్!

జయ—హాజర్ మహరాజ్!

గంగా—ఈదయ్యాలభయముచేత నాకు నిద్దరలోగూడ దయ్యాలే కనఁబడుచున్నాయి. కొంచెం మనస్సు శాంతంగా ఉండడం కోసం రామాయణం చదువుతావా?

జయ—జీ సేట్ మహరాజ్! హుకుం కా మాఫిక్ (రామాయణము తెచ్చి చదువును.)

ద్వి ప ద.

హనుమంతుఁ డావేళ అంబుధిదాటి
ఘనమైనలంకలో కాలుమోపఁగనె,
రాక్షసుల్ భీకరారవములతోడ
భక్షింతు మని వాని పైఁబడరాగ
భూతముల్ దయ్యముల్ బొబ్బల నిడుచు
క్రోతిపై డీకొని గొంతుక పిసుక—

గంగా—హే! ఉండుండు, అట్టె చదువకు.

జయ—క్యా హై మహరాజ్!

గంగా—కుచ్ నహీ మహరాజ్! అరే బాప్రే! బాప్! రామాయణం విందామన్నా రాక్షసులూ దయ్యాలేనా!

జయ—రామాయ న్మే సాబ్ అయిసా హై నా సేట్‌సాబ్!

గంగా—ఏదైన శృంగారమున్న భాగం చదవోయి!

జయ—ఇస్మే కహాఁ మిలేగా సింగారం?

గంగా—అయిసా హై తో రామాయణ్ ఛోడ్ దేవ్. మహాభారత్ పఢో.

జయ—జీ! (మహాభారతము తెచ్చి చదువును.)

ద్వి ప ద.

అపుడు కీచకుఁడు మోహావేశమంది
అపురూపసుందరియైన సైరంధ్రి
మొగమునుఁ జూచి సమ్మోహితుండయ్యె
విగతధైర్యుండయ్యె విరిశరాహతుల
అతఁడు సైరంధ్రితో నతిప్రేమ మీఱ
కుతుకాన రమ్మంచుఁ గోరికఁ దెలిపె

కోపించి యీకాంత కొరకొరలాడి
పాపాత్ముఁడా! కానిపని యంచుఁబలికె.

గంగా—వాఁ! దర్వాన్! వాఁ. మజా హై! బహూత్ మజాహై అచ్ఛా.
పఢో పఢో- అవుర్ భీ పఢో !

జయ—సేటు మహారాజ్ ! కోయీ ఆతా మాలుం హోతా హై ?

గంగా—కౌన్ హై ! దేఖో ! దేఖో !

[ముసుఁగు వేసికొని నాందీబాయి ప్రవేశించును.]

(గంగారాముని భయపెట్టి నిష్క్రమించును.)

గంగా—(అదిరిపడి) అరే దర్వాన్ ! సైతాన్ హై ! సైతాన్!

జయ—అరే భగవాన్ ! సైతాన్ హై ! సైతాన్ !

[రాధాబాయి ప్రవేశించును.]

రాధా—బాబా ! బాబా ! సైతాన్ హై ఆతా బాబా ! ఆతా !

గంగా—అరే ! దర్వాన్ !

జయ—అరే భగవాన్.

గంగా—కైసాహై ! దర్వాన్.

జయ—కైసాహై భగవాన్ !

రాధా—ఆతా బాబా ! ఆతా సైతాన్—

గంగా—అరే దర్వాన్ !

జయ—సేట్ ! మహారాజ్ అభీ యేక్ రస్తా హమ్కూ మాలుం
హోతాహై.

గంగా—బోలో దర్వాన్ ! జల్దీ బోలో.

జయ—ఆప్కాలియే ఏక్ తెలంగీహాకీమ్కు మై లాయాహుం. ఓహాకీంకు
ఆప్కా దేఖ్‌నేసే మై సమస్తాహుం కీసైతాన్ జరూర్ చల్
జాయేగా.

గంగా—అచ్ఛా! దర్వాన్. ఓహాకీమ్కూ ముఝ్కూ ములాఖత్ కరో !

జయ—జీ ! (ఇరువురు నిష్క్రమింతురు.)

—

# రంగూన్ రౌడీ

అను

## పతిభక్తి.

షష్ఠాంకము.



రంగము —1.

స్థలము:—గిరికుమారిమందిరము.

[గిరికుమారి సంగీతగోష్ఠియం దుండగా వికృతాకారముతో ప్రభావతి ప్రవేశించును.]

ప్రభా—అమ్మా! దాహము! దాహము!! (క్రింద పడిపోవును.)

గిరి—(దగ్గఱకు వచ్చి చూచి) అయ్యో! యెవ్వతెయో మిగుల సలసి వచ్చినది-దాసీ! దాసీ! శుభ్రమైన శీతలోదకము కొనిరావే!

దాసీ—(నిష్క్రమించును.)

గిరి—(ప్రభావతిశిరోజములు సరిజేయుచు) ఆహా! విధాత యెంతనిర్దయుఁడు? ఎట్టిసౌందర్యవతి కెట్టికురవస్థ కలిగించెను! ఆహారపానీయములు లేక, మొగము కళఁబాసియున్నను సహజమైన సౌందర్యవిలాస మెట్టివారినైన సమ్మోహింపఁజేయునదిగా నున్నదే! భళి! గిరికుమారియదృష్టము! నాయింటనున్న తొత్తులలో నొక్కతెయు నీమె కాలిగోటికైన సమానమగునది కానరాదు కదా! ఈజగదేకసుందరిని భగవంతుఁడు నాపై ననుగ్రహము సనే పంపియుండెఁ గాఁబోలును! "ప్రాఁతరోత, క్రొత్తవింత" యనునట్లు నావద్దనున్న ప్రాఁతతొత్తులవలన రాబడి క్రమముగా

సమ్మగిల్లుచున్నది. దైవికముగ నాయింటికేగిన యీ ప్రభా వ్మును తెరపై కెక్కించి మరల కొన్ని నాళ్లకొకశృంగారనాటక మాడి రసికుల నాకర్షింపఁగలను. నాయండఁజేరినయీకాంత యెంతుఁ బోఁగలదు ?

ప్రభా—(మూర్ఛలో) దాహము - దాహము.

గిరి—దాసీ ! దాసీ ! ఎంతసేపు జాగుచేసెదవే ! ప్రాణములు పోయిన పిదపఁ దెచ్చెదవా యేమి ?

[దాసి మరబత్తుగ్లాసుతో ప్రవేశము.]

దాసి—లేదమ్మా! బడలికనందియున్నయీమెకు వట్టిమంచినీరు తేనేల నని మరబత్తుకలిపి తెచ్చినందున జాగైనది.

గిరి—(మరబత్తును ప్రభావతిచే త్రాగించును.) అమ్మా ! కన్నులు తెరు వుము. కొంచెము బడలిక తీరినదా ?

ప్రభా—తల్లీ ! నీకు నమస్కారము ! వెడలిపోవనున్న ప్రాణములను నిలిపి పుణ్యముఁ గట్టుకొంటివి. ఇట్టి నీకొకనమస్కారమునకన్న నే నేమిచేయఁగలను ?

గిరి—అమ్మా ! నీవు క్షేమముగ నుండుటయే పదివేలు. ఈ దాసితో లోనికరిగి, శుభ్రజలంబుల స్నానమొనరించి, చెమ్మటం దడిసిన యీవస్త్రములను విసర్జించి, నూతనవస్త్రములను ధరించి. హిత వగునంత భుజించి రమ్మా. నాసంరక్షణమున నున్నంతవఱకు నీకేభయమును గలుగదు.

ప్రభా—అమ్మా !ఈయభాగినికొఱకై నీవేల శ్రమ నొందెదవు ? నాకీ ప్రాణములపై నభిలాష యెంతమాత్రమును లేదు. ఈస్థితియందు నాకు మరణమే శరణము !

గిరి—అమ్మా ! నీపలుకులవలన నీవు మిక్కిలిదుఃఖజీవిని వని యర్థమగు చున్నది. ఐనను మరణము కోరుకొనినయప్పుడెల్ల వచ్చునా ? శరీర మున్నన్నినాళ్లును దీనిని పోషించవలసినబాధ్యత తప్పదు గదా ? విచారమందక నామనవి విని యీ దాసితోలోని కరు

గుము దుఃఖశాంతి గావించుకొనుము. చూచెదవేమే ఈమెను మెల్లగా లోనికిఁ గొనిపొమ్మ.

దాసి—అమ్మా! లోనికి రమ్మ!

ప్రభా—ఆహా! దిక్కులేనివారి కీశ్వరుఁ డెప్పటి కప్పు డేదోయొక యాశామృతముంబోయుచునే యుండునుగదా? (నిష్క్రమించును.)

గిరి—భళిభళీ! కాకినాడలో నాకు పూర్వపరిచితుఁడగు ధనశాలి గంగారాంసేట్ నేఁ డిక్కడికి వచ్చెదనని లేఖవ్రాయుటకును, ఈక్రొత్తపిట్ట నాచేఁ జిక్కుటకును సరిపోయినది. అనుకూలసమయమనిన నిట్లుగదా కలిసిరావలయు! రైలువచ్చి చాల తడవైనది. సేటుగారింకను రాకుండుట కేమికారణమోగదా?

[దాసి ప్రవేశము.]

దాసి—అమ్మా! కాకినాడకాపురస్థులఁట. మార్వాడీలట!

గిరి—ఆఁ! ఏమి? గంగారాంసేట్‌గారు వచ్చినారా?

దాసి—ఔనమ్మా! వారే వచ్చియున్నారు?

గిరి—సరి! నేనును వారికొఱకే వేచియున్నాను. నేను వారి కెదురేగి తీసికొనివచ్చెదను. ఈలోపల నీవు గదియంతయు నలంకరించి పరిశుభ్రముగా నుంచుము. (నిష్క్రమించును.)

దాసి—(గదిని అలంకరించుచుండును.)

[గిరికుమారి, గంగారాంసేట్ ప్రవేశము.]

గంగా—(గదినంతయు కలయఁ జూచి) గిరికుమారీ! మీవృత్తి కెచ్చట నున్నను 'నిత్యకల్యాణము పచ్చతోరణమే' కదా?

గిరి—ఏమున్నది బాబూ! కాకినాడలో నున్నప్పటి ఖాతాబేరాలన్నీ చల్లబడ్డతరువాత, విజయనగరం చేరుకున్నందువల్లనే కాస్తపీలుగా బ్రతుకుచున్నాను. నాఁటికి నేఁడేగదా! తమరికి దాసురాలిమీఁద కరుణగలిగినది!

గంగా—గిరికుమారీ! నాదయయెంత! నే నెంతగాని, ఈమందిరము యీ దర్జాచూస్తే కాకినాడలోకన్నా కావలసినన్నిరెట్లు సౌఖ్యంగా ఉన్నావని తోస్తుంది.

గిరి—ఇదందా మీచలవే! సేట్‌గారూ! నిలువబడేవున్నారు. కాస్త వినోదంగా మాపిల్ల నృత్యం చేస్తుంది. కాలం గడుపుతూ ఉండండి. ఈలోగా మీరెప్పుడూ చూడని అప్సరసను తెచ్చి అమురుస్తాను. పిల్లా! సేటుగారిముందర కాస్సేపు నృత్యంచెయ్యి.
(నిష్క్రమించును.)

(నృత్యాంగన నృత్యము చేయుచుండును. సేటు ఆనందించుచుండును.)

గిరి—[అలంకృతయైన ప్రభావతితో ప్రవేశము.] (సేటుగారితో రహస్యముగ) సేట్ మహారాజ్! ఇది కొంచెము క్రొత్తగిత్త. మాలిమి అగువరకు మచ్చికపరచుకొని శ్రమపడవలెనేమో. అలవాటుపడినదా అనుభవమునకు లోటులేదు. ఐనా రసజ్ఞులైన మీకు చెప్పవలసిన దేమున్నది?

గంగా—(రహస్యముగ) మీరందఱు తప్పుకోండి. నాతంటాలేమో నేను పడతాను.

ప్రభా—(స్వగతము) ఆహా దైవమా! మరల నన్నెన్నికష్టములపాలొనరింప సంకల్పించితివి? ఇది యొక వేశ్యాగృహామువలె తోఁచుచున్నది. స్వార్థపరురాలగు నీజారిణి నన్ను రక్షించునెపమున లంజరికముచేయింప సంసిద్ధురాలైనది.

ఉ. ఆకటఁ జావనున్న నను నాగతి నంతము నందనీక, పా
పాకరమైన జారిణిగృహంబునఁ జేరిచి లోకు లెల్లరుఁ
గాకులవోలె నవ్వనగు కట్టడిలంజరికంబు సల్పగా
నాకు విధించినాఁడవె ఘనంబగు పాపఫలంబుగా? విధీ!

ఇంక నాకెవ్వరు రక్షకులు? ఎవ్వరు నామొరాలించునారు? ఎవ్వరు

నన్ను పాలించువారు? ఓజగత్పతీ: నీవు దప్ప నాకు శరణ్య మింకెవ్వరుం గానరారు.

గిరి—ప్రభావతీ ! ఏమి యాలోచించుచున్నావు ?

ప్రభా—అమ్మా ! ఆలోచన కేమున్నది ! ఆపత్కాలమునుండి రక్షించిన తలను గానుగలో నిడికించిన నికరుణాస్వభావమునకై విచారించుచున్నాను.

గిరి—ఈవేదాంతవిచారణ కేమిగాని, చూడు అతఁడు చాలా ధనశాలి, రసికుఁడు, నీతో నేమో సంభాషింపఁ గోరుచున్నాఁడు. మాకం దఱ కావల పనియున్నది. పోయెదము. నీవాతని నానంద పరపుము.

ప్రభా—అమ్మా ! మంచిది. నాగతి యెట్లున్న నట్లగును. మీకు పని యున్న పోవచ్చును.

గిరి—(గంగారాంతో రహస్యముగా) కొంచెము మెత్తపడుచున్నది. ఇప్పుడే యూదరఁగొట్టిన నుపయోగింపవచ్చును. నాకు సెల విండు. (మిగతవారితో నిష్క్రమించును.)

గంగా—(ప్రభావతిని సమీపించి) ఓసుందరీ! నేను కాకినాడపట్టణము లో పేరుమ్రోగిన మారువాడీని. నన్ను గంగారాంసేట్ బహద్దర్ అంటారు. బహుశా నాపేరూ, ప్రతిష్ఠా, వినే వుంటావు. నావల్ల అనేకమంది వేశ్యలు బాగుపడి బంగారుమేడలు కట్టారు. ఇదిగో; విన్నావూ ? నాపుట్టుక, పూర్వోత్తరం, నారసికతా, నామంచీ, నాచెడ్డా, అంతా - గిరికుమారికి తెలుసును. అందు చేత ఆవిడే నీకు నావిషయంలో చాలాదూరం చెప్పేసి ఉంటుం దని నన్ను నే నాట్టే పొగుడుకోవడం లేదు. విన్నావూ !- అదిగో - కళ్ళు చిట్లిస్తున్నావు. పోనీ నావిషయ మిదివఱకే విన్నావు గాఁబోలును. అందుచేత ఆట్టే చెప్పితే చిరాకుపడుతున్నట్టు

న్నావు. నావిషయం చెప్పనులే! నీవిషయంచెప్పనా? నీమొగం చూడగానే ఆకాశంనుంచి చంద్రబింబం భూమికి దిగిందేమో అనుకున్నాను. ఐతే, చంద్రబింబాని కున్నకళంకం నీమొగంలో కనబడలేదు. అందుచేత ఆవుద్దేశ్యం రద్దుపరచుకున్నాను. విన్నావూ!- అదుగో! మళ్ళీ చేపపిల్లలాంటి నీకళ్ళు చిట్లిస్తున్నావు. ఓహో! సరే! నీదృష్టి నావేలివుంగరంమీద పడుతూంది. ఇది వజ్రపు టుంగరం. నీవు మొగమోటంచేత అడగలేకున్నా నేనే ఇస్తాను. ఇది నాలుగువేలు ఖరీదు చేస్తుంది సుమా! ఇదిగో! వుంగరం. వేలికిపెట్టనా? అదుగో! మొగము చిట్లించావు. పోనీ, నీవే వేలికి పెట్టుకో! (ఉంగరమిచ్చును.)

ప్రభా—(స్వగ) ఆహా! ఏమి నాఅదృష్టము! పరమేశ్వరుఁ డెంత కృపామయుఁడు! మనసార నమ్మినవారి నన్యాయము చేయఁడు గదా! ఈమూఢుఁడు నాహృదయమును గ్రహింపలేక, నన్ను ప్రసన్నురాలినిగాఁ జేసికొనఁదలంచి, వజ్రాంగుళీయక మిచ్చినాఁడు. ఈయుంగుళీయకమునందలి వజ్రమే నాసర్వకష్టములకు శాంతిని ప్రసాదించుఁగాక!

గీ. ఎఱిగి యెఱుఁగక చేసిన దురితములను
సర్వమును క్షమియించి నీ సన్నిధాన
మందుఁ జేర్చుకొనుము దైవమా! త్వదీయ
దాసురాలికష్టముల నంతంబుజేసి.

(ఉంగరమును నోట నిడుకొని నమలును.)

గంగా—(దిగ్భ్రాంతుఁడై) ఆ! ఆ! ప్రభావతీ! ప్రభావతీ!! ఎంత దారుణము చేసితివి! ఎంతదారుణము చేసితివి!

ప్రభా—(భూమిపైఁబడి) సేట్‌జీ! విచారింపకుఁడు! మీకిదే నమస్కారము. ఈ భూమిపై నాకెవ్వరును గావింపలేనిమహోపకార

ముఁ గావించితిరి. నాపాలిటిభగవంతునివలె నేగుదెంచి, నా పాపజీవితము నంతము నందించి పరమేశ్వరసాన్నిధ్యమునకు దారిచూపితిరి. మీకిదే తుదినమస్కారములు. అబ్బా! కన్నులు పచ్చనై ప్రపంచమంతయు గిరగిరఁ దిరిగిపోవుచున్నది. సేట్‌జీ! మీకిదే నమస్కారము. నే నిఁక మాటాడజాలను. హా భగవానుఁడా! (మరణించును.)

[దాసి ప్రవేశము.]

దాసి—హా! హా! ప్రభావతి మరణించినది. ఏమిగతి!

(నిష్క్రమించును.)

గంగా—అరరే! నిజముగా నిది మరణించినది. ఈఖూనీకేసొకటి నాపైఁబడును గాఁబోలును. ఎవ్వరును చూడకముందే నేను పారిపోవడమే మంచిపని. (పోఁబోవును.)

[రెండవవైపునుండి- శంకరరావు తూలుచు ప్రవేశించును.]

గంగా—(చూచి) ఏమి యిది! శంకరరావువలె నున్నాఁడు. ఈహంతకుఁడు తిరిగితిరిగి తుద కిక్కడకు చేరుకున్నాఁడా! త్రాగియున్నట్టున్నాఁడు. ఇదే సమయము. ఈఖూనీకేసును వీనిమీద త్రోసెదను. (నిష్క్రమించును.)

శంక—గిరికుమారీ! గిరికుమారీ! ఏదీ యెక్కడను గనఁబడదే. (ప్రభావతినిజూచి) ఇచ్చట నెవ్వరో పడియున్నారు. మరణింపలేదు గదా! (దగ్గరకేగి పరికించి) హా! భగవానుఁడా! ఇదియెవ్వరు? ప్రభావతియా యేమి? పిశాచమువలె నావెంటఁబడి యిక్కడకుఁగూడ వచ్చినదే! వచ్చిన దిట్లు చచ్చినట్లు పడియుండె నేల! (కాలితోఁ దన్ని) ప్రభావతీ! ప్రభావతీ! ఏమి పలుకదు. కదలదు. (శ్వాస పరిశీలించి) దైవమా! ఇంకేమున్నది! దీని శరీరమున ప్రాణములులేవు.

(తెరలో) పకడో- పకడో- శంకరరావుకూ పకడో. బంద్ కరో!

శంక—(ఉలికిపడి) ఇది నామామ యగు తులసేరావు కంఠధ్వనివలె నున్నది. రానిమ్ము. వీనిప్రాణములు నేటితో సరి.

(తుపాకి సవరించుకొనును.)

[పురుషాకృతితోనున్న అన్నపూర్ణతో తులసిరావు ప్రవేశము.]

తుల—శంకరరావు! నిలువుము. ఇంతకాలమునుండియు నన్ను తప్పించుకొని తిరిగితివికాని, ఇంక నెంమును పారిపోవఁజాలవు. నేఁడు నీసర్వాపరాధములకును నిన్ను సర్కారువారి కప్పగించి నా బాధ్యతను తొలగించుకొందును.

శంక—మామగారూ! మీకు నాపై నింత వృథాకార్పణ్య మేటికి?

తుల—నీవు హంతకుఁడవు- చోరుఁడవు- జారుఁడవు- నీతిభ్రష్టుఁడవు- మతభ్రష్టుఁడవు- కులభ్రష్టుఁడవు- నిన్ను శిక్షింపక తప్పదు. ఈశ్వరసమ్మతముగా నీకు శిక్ష కల్గింతును.

శంక—అబ్బా! ఎన్ని భ్రష్టతలు నాయం దారోపించినావు! మామా! ఇన్నివిధముల భ్రష్టుఁడ నయినను అదృష్టభ్రష్టుఁడనుమాత్రము కాలేను సుఁడీ!

తుల—ఇంతవఱకు కాకున్నను నేఁ డదికూడ కానున్నదని యెఱుఁగుము.

శంక—కాదు- కాదు. ఎన్నటికిని కాఁజాలఁదు. వెఱ్ఱిభ్రాంతి యేల పెట్టుకొందురు. ? శంకరరావుతోడ శత్రుత్వము పాముతో చెరలాట మని యెఱింగి మర్యాదగా నిచ్చటనుండి తొలఁగిపొండు; మీ క్షేమమునకై చెప్పుచున్నాను.

తుల—కానిచో- నాక్షేమమున కపాయముగల్గునా!

శంక—తప్పక కల్గితీరును!

తుల—ఓరీ! దుష్టుఁడా! కులభ్రష్టుఁడా! చేసినపాపములకు సిగ్గుపడి తలవంచుకొనక మొండితనము వహించెద వేల? వృద్ధుఁడైన రం

గారావును చంపితివి. నిర్దోషియగు రమేశబాబును తుపాకితోఁ గాల్చితివి. అసంఖ్యాకులగు పోలీసులను జంపితివి. నేఁడీవేశ్యా గృహముం జొచ్చి యీకాంత నొకతెను ఖూనీచేసితివి. ఇన్ని ద్రోహములకు నీ వేసమాధానము చెప్పఁగలవు ?

శంక—ఎన్ని ద్రోహములైన చేసియుందునుగాని, యీకాంతనుమాత్ర ము నేను ఖూనీచేయలేదు- లేదు. అన్యాయమైన వాచాదోష మునకు పాలుగాకుము.

తుల—ఏమీ ! దీనిని చంపలేదా ?

శంక—లేదు.

తుల—ఛీ ! అనృతాలాపీ !—

శంక—నేనుకాను; అనృతాలాపివి నీవు.

తుల—దురాత్ముఁడా ! నీతో వాగ్వివాదమున కిది సమయముకాదు. నాకు సమాధానము చెప్పినట్లుగాదు. న్యాయపీఠమునెదుట చె ప్పుకొనుము. (అన్నపూర్ణతో) ఓయీ ! చూచెదవేమి ! వీనిని బంధింపుము.

శంక—ఏమీ ! నన్ను బంధింపఁదలచి వచ్చితివా ! వలదు సుమా ! ప్రాణాపాయకరము సుమా !

తుల—ఆ ప్రాణాపాయమేమో చూడఁదలఁచియే వచ్చితిని.

శంక—మామా ! నన్ను బంధించుటకన్న వేఱుమార్గము లేదా ?

తుల—"మామ; అల్లుఁడు" అను దుష్ప్రసంగము మానివేయుము. మనకట్టి సంబంధములు వదలి చాలకాలమైనది.

శంక—ఆఁ ! పట్టిమాట- ఎట్లు వదలును ? కాలుకడిగి కన్యాదానము చేసితివే ! అట్టిసంబంధ మింత శీఘ్రముగా వదలఁగలదా ?

తుల—ఓరీ ! నీనక్కనైచ్యములను మానివేయుము. నీ కిదే యంత్య కాలము.

శంక—నాకా ? నీకా ?

తుల—నాకేల కల్గును ?

శంక—ఏలకల్గునా ! చెప్పియుండ లేదా ! శంకరరావుతో శత్రుత్వము ప్రాణాపాయకరమని-

తుల—నీమొండితనమునకు నవ్వు వచ్చుచున్నది. పాపాత్ముండా! నే నింక కాలయాపనమున కోర్వను.

శంక—నేనును ఓర్వలేకున్నాను. ఇంక కాలయాపన మేల ! పదిహత్యలతోపాటు పదునొకండవ హత్య. చావు దురాత్ముండా !

(తుపాకి ప్రేల్చును.)

తుల—హా ! హా ! హంతకుండా ! (మరణించును.)

అన్న—(తండ్రిపైఁబడి) హా ! తండ్రీ ! తండ్రీ ! మరణించితివా ? అల్లుని చేతనే హతమైతివా? ఇంక నా కేది దారి ?

శంక—ఓసీ ! నీ వెవ్వఁడవు ! వీఁడు నీకు తండ్రి యెట్లగును ?

అన్న—(చేతులు జోడించి) స్వామీ ! ఈదీనురాలు, పురుషాకారము దాల్చియున్న మీదాసురాలు అన్నపూర్ణ.

శంక—అన్నపూర్ణ ! అన్నపూర్ణ ! భర్తను బాధించుటకే సాహసించి వచ్చితివా ?

అన్న—స్వామీ ! ఈయభాగ్యురాలు అంతద్రోహము తలపెట్టలేదు. ఎట్లయిన తమదర్శనము చేయింపు మని నేను వేఁడుకొనగా నా తండ్రి ఈవేషముతో నన్నింటఁ గొనివచ్చెను.

(తెరలో) ఖూనీ హోగయా! పకడో! శంకరరావుకూ !

అన్న—ప్రాణేశ్వరా! పోలీసువారు మిమ్ము వెంబడించి వచ్చుచున్నారు. మీరు శీఘ్రముగ పారిపొండు. ఈరెండుహత్యలఫలితమును మీకు మారుగా నే ననుభవించెదను.

(తెరలో పకడో ! పకడో !)

శంక—హా! దైవమా! ఎట్టిదుష్కరఘటనముల నెట్లు మార్చివేయుచు న్నావు?

అన్న—తొందరపడకున్న ప్రమాదము రాఁగలదు. స్వామీ! స్వామీ! ఆతుపాకిని నా కిచ్చి పారిపొండు.

శంక—(నిస్పృహుఁడై తుపాకిని పారవైచి పరుగెత్తును.)

అన్న—(తుపాకిని పట్టుకొని నిలువఁబడును.)

[పోలీసుఇన్స్పెక్టరు ఇద్దఱు పోలీసుభటులతో ప్రవేశించును.]

ఇన్—ఎవ రీయింట హత్యచేయుచున్నది ?

అన్న—అయ్యా! కనుపడుచుండుట లేదా! నేనే హత్యచేసినాను. ఒకటి కాదు రెండుహత్యలను చేసినాను. నన్నే బంధింపుము.

ఇన్—నీ వెవ్వఁడవు? శంకరరావుహత్యచేసెనని వింటిమి. ఆతఁ డెక్కడ ?

అన్న—నే నెవ్వఁడనో అది మీ కేల ? హత్యచేసినది నేను. నన్నే బంధింపుఁడు.

ఇన్—శంకరరా వెక్కడ ?

అన్న—శంకరరా వెవఁడో నే నెఱుఁగను.

ఇన్—అట్లయిన నీవే నా హంతకుఁడవు ?

అన్న—ఇదివఱకు రెండుసార్లు మనవిచేసితిని.

ఇన్—భటులారా! వీనిని బంధింపుఁడు.

భటులు—(అన్నపూర్ణను బంధింతురు.)

(తెరవ్రాలును.)

---

రంగము - 2.

స్థలము—గంగారాంసేట్ గృహము.

[గంగారాం, జయరాం ప్రవేశము.]

గంగా—దర్వాన్ !—

జయ—మహరాజ్ !—

గంగా—నాకు పెద్ద—నాకు పెద్ద—పెద్ద—పెద్ద—(వణఁకును.)

జయ—ఏమిటి ! నీకు పెద్ద ?

గంగా—ఉండవోయ్- ఉండు. కొంచెము తమాయించుకోనీ! కొంచెము శాంతపడనీ! తొందరపెట్టకూ అబ్బా! చూడు గుండెలు కొట్టుకొంటున్నాయి !

జయ—ఏమిటి! సైతాన్ కాదు గదా ?

గంగా—(అదెరిపడి) బాబోయ్! దర్వాన్? (వెఱ్ఱికేక పెట్టును.)

జయ—అరే భగవాన్ !

గంగా—ఉండు—నాకు—పెద్ద—నాకు—పెద్ద—

జయ—ఆఁ! ఆఁ! పెద్ద—పెద్ద—ఏమిటో తమాయించుకొని చెప్పండి. గాభరా పడకండి.

గంగా—నాకు పెద్దజ్వరం వచ్చిందోయ్ దర్వాన్ !

జయ—ఎందుకనీ ! మీా కిప్పుడు జ్వరం ?

గంగా—ఎందుకా ! ఎందుకా నువ్వెఱుగవూ! నాకొంపలో సైతాన్ చేరింది;నాలో సైతాన్ చేరింది;నాకూతురులో సైతాన్ చేరింది ఇంతకు నువ్వు దర్వాన్వో సైతాన్వో తెలియకుండా వుంది.

జయ—నేను సైతాన్ ఎందు కవుతానూ? నేను; దర్వానునే !

గంగా—ఏమో! ఓసైతాన్ !—

జయ—సైతాన్ కాను; దర్వాన్.

గంగా—దర్వానూ సైతానూ ఒక్కటేరా బాబు- ఒక్కటే నువ్వు ప్రవేశించాకే నాకొంపలో సైతాను ప్రవేశించింది.

జయ—సరే కాని, మీాజ్వరానికి కారణ మేమిటి ?

గంగా—సైతాన్భయముచేత విజయనగరం వెళ్లి సానికొంపలో సరసా లేడ్చాను- బాబో! అక్కడే! అక్కడే! అక్కడే జరిగింది—

జయ—ఏమిటీ! ఏమి జరిగిందీ !

గంగా—జరిగింది. ఏం జరిగితే యేమి - నావల్లనే జరిగింది. అయితే శంకరరావుమీద తోసేశాను. పోలీసుకు రిపోర్టిచ్చాను కూడా

జయ—ఏం జరిగిం దయ్యా?

గంగా—అబ్బా! పోనిస్తూ! ఏదో ఒకటి జరిగింది. తలచుకుంటే మళ్లీ తల తిరుగుతూంది.

జయ—ఖూనీగాని జరుగలేదు గదా !

గంగా—అరే సైతాన్! అదేనోయి జరిగింది - అదే.

జయ—సైతాన్ అనకండి. దర్వాన్ అనంకి.

గంగా—దర్వానే హార్వాన్, హార్వానే సైతాన్.

[పోలీసు వేషముతో కృష్ణమూర్తి ప్రవేశము.]

కృష్ణ—ఈ యింటియజమాని గంగారాంసేట్ యెక్కడ !

జయ—సేట్ మహారాజ్ ! పోలీసుభీ ఆగయా ! అబ్ క్యాకర్ సక్తే !

గంగా—పోలీస్ క్యా వాస్తే ఆయా? మేరా ఘుర్కా !

జయ—ఖూనీ మొఖద్దమామే, ఆప్కా పకడ్ లేజానేకా వాస్తే, మహారాజ్ !

గంగా—అరే - ఘూఫ్ రే ఘూప్! కూనీ కౌన్ కియా హై ?

కృష్ణ—నీవేనా! గంగారాంసేట్ అనేవాఁడవు !

గంగా—ఔను బాబూ ! ఔను నేనే.

కృష్ణ—నీపేర వారం టుంది. నిన్ను ఎర్రెస్టు చేయడానికి వచ్చాను.

గంగా—బాబో! నాకు వారం టెందుకు! నన్నెందు కెర్రెస్టు చేస్తారూ?

కృష్ణ—విజయనగరంలో, గిరికుమారి అనే వేశ్యయింట్లో - ఆడదాన్ని ఖూనీచేసి, ఆనేరం మఱొకరు చేసేనట్టుగా తప్పుసాక్ష్య మిచ్చిన రెండు నేరాలకున్నూ.

జయ--సేట్మహారాజ్! అంతా పబ్లిక్ అయిపోయింది. నిజమొప్పుకోండి.

గంగా—అరే ! నువ్వొకఁడవు- శనిలాగ- నాకెక్కడ దాపరించావురా?

కృష్ణ—ఏమిటీ ! ఆలస్యం. చేతులకు బేడీలు వేయాలెనా ? తిన్నగా ఠాణాకు నడుస్తావా ?

గంగా—అయ్యో బాబో! ఇ దెక్కడి గ్రహచారము ?

కృష్ణ—కల్లబొల్లి యేడ్పులు కట్టిపెట్టి నడు నడు.

గంగా—నేను,ఖూనీ చేయలే దయ్యా! ఉంగరం తిని, ఆముండేచచ్చింది.

కృష్ణ—ఆసంగతి కోర్టులో చెప్పుకుందువుగాని పద—

గంగా—అయ్యో ! దర్వాన్ !

జయ—అరే ! భగవాన్ !

గంగా—ఇప్పుడేం చేయ మంటావు ?

జయ—బాబూ ! ఇది ఖూనీ కేసు - ఉరిశిక్షో, ద్వీపాంతరవాసమో తప్పదు.జమాఖర్చులు అప్పగింతలుపెట్టి చల్లగా దారిచూచుకోండి.

గంగా—శంకరరావుఆస్తి అంతా అన్యాయంగా ఛపాయించేశాను. ఆపాపంచేతనే సైతాన్ కూడా వెంటబడ్డది.

జయ—అయితే అందుకు విచార మెందుకు మహారాజ్ !

గంగా—విచారపడక యేంచెయ్యమంటావ్.

జయ—వెళ్ళేవా రెల్లాగా జైలుకు వెళుతూనే వున్నారు. ఈపాపం కూడా వొకటి మూటగట్టుకొని వెళ్ళడ మెందుకూ! శంకరరావు భార్యా, కుమారుడు క్షేమంగానే వున్నారు. కనుక వారి ఆస్తి వారికి రాసిచ్చేయండి, మీకుటుంబానికి మీ ఆస్తేయెక్కువ—

గంగా—సరే! ఆపాప మొకటి పరిష్కారమై పోయింది. మరి సైతాన్ సంగతి యేమిటీ !

జయ—నేను ఒకవుపాయం చెపుతాను. కోపపడకపోతే-

గంగా—అన్నికోపాలూ అణఁగిపోయి జెయిల్లోకి సిద్ధంగా వున్నాను. ఆవుపాయ మేమిటో శీఘ్రముంగాచెప్పివేయి—

జయ—మీా రెఱుగని వుపాయమేమిటీ! సైతాన్ రాసినవుపాయమే వుపాయం.

గంగా—ఏమిటీ! జయరాంగాడికి బిడ్డ నివ్వమంటావా?

జయ—నామనవి అదే! ఏమంటారా! మీా రిప్పుడు జెయిలునకు వెళతారు. మీాకు కావలసినంతధనం ఆస్తీ వున్నాయి. మొన్న మొన్న మీాకుపుట్టిన కుఱ్ఱవాఁడూ—

గంగా—నాకు పుట్టలేదోయ్. నాభార్యకు పుట్టినాఁడు. నాందీబాయికి పుట్టాఁడు. అర్థంచేసుకుని మాట్లాడూ!

జయ—అదే అదే! మీాభార్యకు పుట్టినకుఱ్ఱవాఁడే! చిన్నవాఁడు-ఆస్తి అంతా ఆగమైపోతుంది - అందుచేత రాధాబాయిని జయరాంకిచ్చి పెళ్ళిచేస్తే ఆస్తిని సంరక్షిస్తాఁడు. కుటుంబానికి ఆధారమవుతాఁడు.

గంగా—వాఁడు నాకు శత్రువు గాడటోయ్ దర్వాన్! శత్రుఁడికి బిడ్డనిచ్చి సంసారం, ఆస్తి అంతా అప్పగించేదా?

జయ—అయితే జెయిల్లోకూడా సైతాన్ తప్పదు.

గంగా—అరే దర్వాన్!

జయ—అరే భగవాన్!-

గంగా—ఐతే, ఇదే సిస లంటావా?

జయ—తప్పకుండా—

కృష్ణ—ఎంతసే పీఆలోచన! జెయిలుకు నడూ!

గంగా—ఉండరా బాబు! నీతో అంకుమొగుడుతద్దినము వచ్చిందీ! ఆస్తీపాస్తీ అప్పగింతలు పెట్టనీ! అయితే దర్వాన్! మన కాజయరాం యెక్కడ దొరుకుతాఁడు మరి?

జయ—అదంతా తమకెందుకూ! కాగితం వ్రాయడంపని తమదు కానివ్వండి. ఇక్కడున్నట్టుగా జయరామ్‌సింగును యీాడ్చుకొచ్చే భారము నాది.

కృష్ణ—జల్దీ; జల్దీ; కానివ్వండి. ఆట్టేసేపు నే నాగేవాఁడను గాను.

రంగా—తాళవోయ్ అంకుమగఁడా! తెయితక్క లాడతావేమి ? దర్వాన్! ఇపుడు నామన స్సెంతమాత్రం స్వాధీనంగా లేదు. పెద్ద గందరగోళంలోపడి కొట్టుకుంటున్నాను. ఆకాగితం కూడా నీవే రాసెయ్యి. సంతకంపెట్టేస్తాను.

జయ—చిత్తము- (కాగితం వ్రాసి) చిత్తగిస్తారా!

రంగా—(చదివి) అంతా సరీగా వుంది. అయితే-ముందువిధాన మేమిటో, ఆజయరాంకూడా ఇప్పుడే వస్తే ఆస్తి అంతా ఆతనికి ఒప్పగించి, పెళ్ళిచేసేసి పెందలాడే దారి చూచుకుందును. ఇదిగో సంతకం చేస్తున్నాను. (చేయును.)

[నాందీబాయి - రాధాబాయి ప్రవేశము.]

రాధా—నాన్నా! ఏమి టీగడబిడ? మనింటికి పోలీసు లెందు కొచ్చారూ ?

నాంది—మూర్ఖు ప్యారా! ఏ గడబిడ్ క్యా హై?

జయ—ప్యారాకూ ప్యాదా పకడ్ జాతా హై!

రంగా—ఖూనీకేసులో పోలీసువాళ్ళు జెయిల్లోకి లాక్కుపోతున్నారు. చేసినపాపాల కన్నిటికీ చెప్పుదెబ్బలు కొట్టుకున్నాను. శంకరరావు ఆస్తి ఆతనికొడుక్కు రాసిచ్చేశాను. సైతాన్ను వదిలించుకోవడానికి - రాధాబాయిని జయరాము కిచ్చి పెళ్ళిచేస్తాను. ఆసంగతికూడా కాగితంలో రాయించేసి సంతకం చేశాను.

రాధా—నిజమేనా! బాబా! నిజమేనా ?

రంగా—అంతా నిజమే. ఇదిగో సంతకంచేసిన కాగితం. దర్వాన్ దగ్గిరే ఉంది. ఐతే నేను జెయిలుకు వెళ్ళకముందే జయరామ్‌గాడొస్తే పెళ్లిచేసేద్దును.

రాధా—బాబా! జయరాంసింగును తీసుకొస్తాగాని శత్రువుఁడని కోప పడవుగదా ?

గంగా—శత్రుఁడు గాఁడు - అల్లుడు. కోప మెందుకమ్మా! సైతాన్ వాఁడిలిపోతే చాలు ననుకొంటున్నాను.

రాధా—అయితే బాబా! ఇదిగో! దర్వానే జయరాం (మీసములు లాగివేయును.)

జయ—దర్వానే జయరామైతే, పోలీసే కృష్ణమూర్తి. ఇద్దఱం ఇక్కడే వున్నాం. మామగారూ! మీదయ - మాభాగ్యము.

(కృష్ణమూర్తి వేషము తీసివేయును.)

గంగా—(తెల్లబోయి) ఆరి దొంగముండాకొడుకుల్లారా! ఇద్దఱూ చేరి ఇంతపని చేశారా!

కృష్ణ—సేట్‌గారూ! క్షమించాలి. మేము చేసినపని మీ కెప్పుడూ అపకారం కాదు. మీకు జెయిలూ, అన్యాయమువలన గలిగే పాపమూ - ఈరెండూ లేకుండా రక్షించాము.

గంగా—అయితే, సైతానింక రాకుగదా?

కృష్ణ—రాదు.

గంగా—జెయిలులోకి పో నక్కఱలేదు గదా?

కృష్ణ—లేదు.

గంగా—అరే! నే ననుకొన్నంతా అయింది. హర్వానే దర్వాన్ - దర్వానే సైతాన్.

జయ—దర్వానే సైతాను గాదు! దర్వానే జయరాం.

కృష్ణ—అదీ కాదూ! దరవానే దామాద్.

గంగా—సరే. జరగవలసిన దంతా జరిగింది. ఇప్పుడు నా కేమిసెలవు!

కృష్ణ—మీరు సంతకం చేసినకాగితం ఎలాగూ చలామణీ కావలసినదే! కనుక శంకరరావుకుమారునికి ఆస్తి అప్పగించే భారము నాది. రాధాబాయికీ జయరామునకూ ఇప్పుడే పెళ్ళి చేసేద్దాం.

గంగా—సంతోషం. అయితే ఇదే శుభముహూర్తం, కానివ్వండి.

కృష్ణ—(రాధాజయరాముల చేతులు పట్టించును. అందఱు దీవింతురు.)

పాట.

మారాధమ్మ పెండ్లికూతు రాయెనే। మా॥
జయరాము పెండ్లికొడు కాయెనే। మా।
ఆనంద మానంద । మానంద । మానంద ।
మానందమాయే । బ్రహ్మానందమాయే। మా॥

(తెరవ్రాలును.)

---

## రంగము - 3.

స్థలము:—ఒకబయలు.

[విచారముతో శంకరరావు ప్రవేశము.]

శంక—కటకటా! ఎంతకఠినకర్ముఁడను- ఎంతపాపాత్ముఁడను. ఈ ఛండాల జన్మున కింక నీధరణిపై తరణోపాయము గలదా! హా! అన్నపూర్ణా! అన్నపూర్ణా! ఓమహాసాధ్వీ! పవిత్రమై అనిర్వచనీయమై, అనుపమానమై, అనన్యసామాన్యమైననీపాతివ్రత్యమే యీనిర్భాగ్యు నింతకాలము రక్షాకవచమై కాపాడినది. అందులకు ప్రతిఫలముగా నేను నీ కేమొసగించితిని! ఆహా! తలంచుకొనిన గుండెలు బ్రద్దలగుచున్నవి. ప్రాణములు తల్లడిల్లుచున్నవి! పవిత్రమైన నీశిరమునుధూళిధూసరితమౌనట్లుతన్నిన యీపాపాత్మునిపాదము లింకనువిరిగిముక్కలు గాకున్నవేమి? పరమపావనతరమైన నీనామమునుచ్చరించుటకైనను అర్హముగానియీపాడునాలుకగర్భనిర్భేదముగ నిన్ను దూషించినందులకై యింకను పురుగులు పడిపోవకున్నదేమి! దివ్యతమకాంతిపుంజములచే నావంటి కలుషస్వరూపునకు తేరిచూచుటకైనను సాధ్యముగాని నీశరీరమునుండి రక్తధారలు నేలనొలుక కటారిచే పొడిచిన యీపాపిహస్త మింకను

పటాపంచలు గాకున్నదేమి! హా! దేవి! యీనరరూపరాక్ష
సునివలన ఈమనుష్యాకారభూతమువలన ఇహసౌఖ్యము నీవ
ణ్మాత్రమైన నెఱుంగకున్నను తాళి గట్టినమహాపరాధమునకు
ధర్మపాశబద్ధవై, నేనవివేకినై, త్రాగుబోతునై, కులభ్రష్టుండ
నై, హంతకుఁడనై యొనరించిన సర్వాపరాధములను, సమస్త
రాజద్రోహములను, నీపై నిడుకొని కంటికిఱెప్పవలె, కన్నతల్లి
వలె నన్నురక్షించుటయే కర్తవ్య మని భావించితివి. భార్యవగు
నిన్ను రక్షింపవలసిన ధర్మమును తలక్రిందులుగా గావించి హంత
కుఁడనై నిన్ను రాజభటుల కప్పగించి మోఁడినై ఇంక నెవ్వరి
కొఱకు, ఏసౌఖ్యములకొఱకు ప్రాణముల నీకలుషాంగమున
ధరించియుంటిని! అన్నపూర్ణా! ఈ పాపాత్ముఁ డొనరించిన
యసంఖ్యాకదుష్కృత్యములకు శపించి సంహరింపక నీవేల దాక్షి
ణ్యముం బూని రక్షించితివి! దుష్టుఁడనైన నాకొఱకు కన్న
తండ్రికి విరోధివైతివి. చిన్నిసుతుని వెంట నిడుకొని నీవంటి
సాధ్వీమణులు కాలుమోపఁదగని రంగూన్ పురమునకు వచ్చి
నన్ను శోధించి కనుగొంటివి. క్రూరాత్ముఁడనై నిన్ను పరాభ
వించి వంచించిన నాయందు సుంతైన క్రోధమూనక నీకన్నుల
యెదుట నీకన్నతండ్రిని చంపుచున్నను ఆయపరాధమును సైత
ము నీపైనిడుకొంటివే! హా! అన్నపూర్ణా! అన్నపూర్ణా!
ఈజన్మమున యీ పాపాత్ముఁడు చేయని క్రూరకర్మ మొక్కటి
యైన మిగిలియున్నదా! సర్వపాపములును యీమనుష్యునిముఖ
మున పిశాచములై తాండవించుచున్నవి. ఛీ! పాపము. ఈదురి
తాత్ముని ముఖముచూచిన మహాపాపము.

సీ. త్రాగిన పొగరుచే, తండ్రిచావునకయి,
డెందమ్మున ప్రమోదమాదినాను

నీచధనాశాపిశాచదుర్బుద్ధిచే
సద్బ్రాహ్మణోత్తముఁ జంపినాను
రంగూనులో నన్ను రక్షించినట్టి ర
క్షకుని తుపాకిచేఁగాల్చినాను.
అతని దారాధనం బపహరించియు ఘోర
విధి ననాథనుజేసి విడిచినాను
పరమసాధ్వియైన భార్యను రంపానఁ
దరిగినాను కాలఁదన్నినాను
కడకు మామగారిఁ గడతేర్చి హత్యను
గాంత తలను బెట్టి కట్టినాను.

హా! హా! దారుణము! దారుణము! మహాదారుణము! క్షరింపఁజాల. పశ్చాత్తాపమహానలము యీ కలుషశరీరము నాపాదశిరఃపర్యంతమును కాల్చివేయుచున్నది! ఓ మహాజనులారా! చూచితిరా! యీపాపాత్ముని దుశ్చరిత్రమును. ఇట్టిపాపభూయిష్ఠచరిత్రముగల నరహంతకు నెన్నడైనఁ గాంచియుంటిరా! కథలోనైన వినియుంటిరా! కలలోనైన నూహింపగలరా! కల్ల - కల్ల. పూర్వకాలమున జరిగినట్లు కథలుగా చెప్పుకొను పుక్కిటి పురాణములయందలి భయంకరరాక్షసులైన నేను చేసినన్ని దుష్కృత్యములు, నేను చేసినన్ని హత్యలు, నేను పలికినన్ని యనృతములు, నేను సలిపినన్ని దారుణకార్యములు కావించియుందురా! భగవంతుఁడైన, నీచండాలుని శిక్షింపఁ దగినన్నిశిక్షలు తనశిక్షాస్మృతియందు లేకుండుటచే నిట్లు వదలినాఁడు కాఁబోలును. ఓపౌరులారా! ఓజానపదులారా! మిమ్మందఱను ప్రార్థింతును. నాజీవితమున కంతముఁగలిగించి యీపరితాపమునుండి విముక్తునిఁజేయుఁడు. నాజీవితమధ్యమునం దింతవఱకు ఒకరిని ప్రార్థించియెఱుఁగను, ఒకరిని చంపుటయేగాని, ఒకరిచేచంపఁబడియెఱుంగను. ఇట్టి నేను, నేను, ప్రార్థించుచున్నాను. కనికరముచేనైన సరే!

కౌటిన్యముచేసైన సరే! నన్ను సంహరింపుఁడు. (తలబాదుకొని) అయ్యో
యయ్యో! ఈకష్టజీవికి అంతటిభాగ్య మెక్కడిది? కలుషములుతొండవించు
ఈపాపిమొగముంజూడఁజాలక కాఁబోలును పౌరులందఱును తలలు
వంచుకొని సందుసందులఁబడి పోవుచున్నారు! హా హా! మాతృశాప
మూరకపోవునా! వేశ్యాసురాపానలోలతచే నోడలుమఱచికన్నతల్లికి,
తోఁబుట్టువునకు, ధర్మపత్నికి ఒక్కకడియున్నమైనం బెట్టక, కడుపుఁగాల్చిన
పాప మూరకపోవునా? అన్నపూర్ణా! నీతండ్రిని చంపి, ఆ హత్యాదోష
మును నీపైనిడి మొద్దువలె బ్రతికియున్న పాపాత్ముఁడగు శంకరరావు
ఇడుగో! నీవైన శపింపుము. నీవు మహాసాధ్వివి. నీశాపముచే తలపగిలి
నేను చత్తునను నమ్మకమున్నది. శపింపుము - శపింపుము. అన్నపూర్ణా!
పతియాజ్ఞ మీరరానిదిగదా! శపింపుము; శపింపుము. అయ్యయ్యో!
నీవేల నన్నుశపింతువు! ఎన్నిసారులో నన్ను రక్షించుటకై నీప్రాణములను
సైత మియ్య సిద్ధమైన నీవు నన్ను శపింపవు. నే నెఱుఁగుదును. అయ్య
య్యో! నాకేదిగాతి. అన్నపూర్ణా! ఎక్కడనున్నావు! ఆహా! అన్నట్లు
మఱచితి. నీవీపాటికి వధ్యశిలపై నుందు వేమోకదా? ఓ న్యాయాధికారీ!
ఉండుము. ఒక్కక్షణ ముండుము. నీవు నిజమైన న్యాయాధికారివైనచో
ధర్మపరిశీలనచేయుము! తులసీరావును చంపిన ద్రోహియెవ్వరో కనుగొని
శిక్షింపుము. అన్నపూర్ణ చంపినదను కొంటివా! ఓ వెఱ్ఱివాఁడా! నా అన్న
పూర్ణ - పవిత్రురాలగు నాఅన్నపూర్ణ - మహాపవిత్రయైన నా అన్న
పూర్ణ - తండ్రిని - కన్నతండ్రిని - చంపగల హంతకురాలనియే నమ్ము
చున్నావా! ఛీ! నీన్యాయము మండిపోయినది. నీ తెలివి తగులఁబడిపోయి
నది. ఆపీఠమునకు - ఆపావనమైన న్యాయపీఠమునకు నీ వనర్హుడవు.
అర్హుఁడ వైనచో చెప్పుము. ఎవ్వరు తులసీరావునుహత్యచేసినవారు?
నీ తెలివి దీనితో తేటతెల్లమగును. హ-హ్హాహ్హా-హంతకు నన్వేషింప నీకు
సాధ్యమగునా? పట్టెది పట్టెది ఈశంకరరావు- (ఱొమ్ముబాదుకొని)-యీ

శంకరరావుసుమా! మామను చంపినహంతకుఁడు-మామ నొక్కనినేనా? అసంఖ్యాకులైన రక్షకభటులను హతమార్చినవాఁడీశంకరరావే! మీ రందఱు తెలివితక్కువ పందలై, నిరపరాధిని, భర్తృగౌరవప్రాణసంరక్షణి యగు పతివ్రతాశిరోమణిని బంధించి, హత్యాపరాధమునుమోపి, వధ్య శిలపై నెక్కించి, వధింపఁ దలఁచినారు. (క్రోధముతో) ఓరోరిదురాత్మ ర్గులారా' న్యాయాన్యాయవిమర్శక పరిజ్ఞానవిహీనులారా! నాయర్ధాంగి నంటుటకు మీతరమగునటరా! "రంగూన్ రౌడీ" అను విఖ్యాతినొందిన రాజభటభయంకరుఁడగు నీశంకరరావు ప్రాణములతోనుండఁగా నిరపరా ధినియగు నన్నపూర్ణను శిక్షింప మీతర మగునా! మిమ్ముసృష్టించిన బ్రహ్మతరమగునా! ఇంక శంకరరావు ప్రతాపమును మూఁడుఁడు. మిమ్మింద అను మారణహోమము చేయనున్నాఁడు. (వెఱ్ఱివానివలె పఱుగెత్తును.)

(తెరవ్రాలును.)

---

రంగము 4.

స్థలము - న్యాయస్థానము.

[ప్రవేశము - జడ్జి, అన్నపూర్ణ, రైటరు, ఇద్దరున్యాయవాదులు, ఒకపోలీసు.]

జడ్జి—అమ్మా! అన్నపూర్ణా! నిన్ను నే నెన్నఁడును చూడకున్నను, నీపవిత్రచరిత్రమును నే ననేకసారులు వినియుంటిని. ఏమి యింత సాహసమునకు పాల్పడితివి?

అన్న—తండ్రీ! మీరు న్యాయాధికారులు! ఇప్పుడు న్యాయశాస్త్ర ప్రకారముగా, నా కర్హమగుశిక్షను దయచేయుఁడు. అంతే కాని యితరవిషయములను నన్ను ప్రశ్నింపకుఁడు.

జడ్జి—మంచిది. నీచరిత్రమును విమర్శించుటకుగాని, నీకు హితాహిత బోధలను గావించుటకుఁగాని నా కిది సమయముగాదు. అది

నాయధికారధర్మమునుగాదు. నాతీర్మానమును విన్నవించు చున్నాను. ఆలకింపుము—

"హిందూదేశశిక్షాస్మృతి ననుసరించి—గిరికుమారియింట జరిగిన హత్యలను రెంటిని నీవే యొనరించినట్లు స్వయముగా సమ్మతించుచున్నావు. కావున, వేఱు సాక్ష్యములతో నిమిత్తము లేకుండ యిందుమూలముగానీకు ఉరిశిక్షను విధించుచున్నాను."

అన్న—మహాప్రసాదము—

జడ్జి—(పీఠమునుండి లేచును.)

(తెరవ్రాలును.)

---

రంగము-5.

స్థలము:—వధ్యశిలగల బయలు.

[ప్రవేశము—వధ్యశిలపై అన్నపూర్ణ-ప్రక్కన ఖడ్గహస్తుఁడగు కటికవాడు, పీఠముకడ జైలుసూపరింటెండెంటు.]

(గంట మ్రోగును.)

జైలు—అమ్మా అన్నపూర్ణా! ఐదునిమిషములు దైవప్రార్థనముచేసి కొనుటకు నీ కధికారముగలదు - శీఘ్రముగ కానిమ్ము.

అన్న—(కన్నులుమూసి) జగదీశ్వరా!

సీ. జీవితేశునకయి జీవప్రదానంబు
గావింపగా మది గాంక్షఁజేసి,
విభుఁడొనరించిన విద్రోహములనెల్ల
చలనంబులేక నొాదల ధరించి,
హంతకినని పల్కి యధికారవర్గంబు
నదలించి యురికంబమందుఁజేరి,

పావనంబగు భగవద్గీతపైన వి
శ్వాసార్థమైనట్టి ప్రతిజ్ఞ జేసి,
పెనఁగులాడితి స్వామి నావిభునికొఱకు.
అఖిలదోషముల్ మన్నించి యన్నపూర్ణ
భావిజన్మంబులందున ప్రాణనాథుఁ
గాగ శంకరుఁ గూర్పు మోకలుషహరణ !

అయ్యా ! నా ప్రార్థనము పూర్తియైనది. ఇంక మీకర్తవ్యమును వడుపుఁడు.

శైలు—కిరాతుఁడా ! నీ పని కానిమ్ము.

కిరా—(కత్తి నెత్తును.)

[శంకరరావు పటాక్షేపమున ప్రవేశము.]

శంక—నిలుపుము-కిరాతుఁడా ! ఖడ్గమును నిలుపుము—
అన్నపూర్ణా! అన్నపూర్ణా! నీవు నిర్దోషివి. ని స్థితికిఁ దెచ్చిన పాపాత్ముఁడను నేను. నే నుండగా నీవేల వధింపఁబడవలెను ? లెమ్ము. చేసిన సర్వవిద్రోహములకును ఉఱిశిక్ష ననుభవింప నేను వచ్చితిని. నామాఁటవి వినుము. పవిత్రురాలవగు నీ కాపాపప్రదేశము తగినదికాదు. నేను జడ్జిగారికి వ్రాసికొంటెని. నీవధను నిలుపుటకై ఆజ్ఞాపత్రము రాగలదు. రమ్ము - క్రిందికి రమ్ము.

అన్న—నీపాప మేమో నీ వేమో నే నెఱుఁగను. గిరికుమారియింట నేను రెండుహత్యల నొనరించినహంతకి నగుటవలన శిక్షింపఁబడుచున్నాను. అయ్యా ! మీరేల విభ్రాంతులై యింకను చూచుచున్నారు ? మీ రీయున్మత్తునిమాటలను విశ్వసించుచున్నారా ? రాజద్రోహ మొనర్చుట మీకు తగదు. నన్ను వధింప నాజ్ఞయిండు.

శంక—అయ్యా! వలదు. వలదు- ఈమె యనృతములాడుచున్నది. పాపాత్ముఁడనగు నన్ను రక్షించుటకై అనృతములాడుచున్నది; మహాసాధ్వి. న్యాయమును పరిపాలింపుము. నేనే హంతకుఁడను, జారుఁడను, చోరుఁడను. అట్లు న్యాయాధికారుల కెఱుకపఱచియున్నాను. నన్ను వధింపుఁడు- సిద్ధముగానున్నాను.

జైలు—శంకరరావ్! ఈరెండుహత్యలకును యీామె వధింపబడక తప్పదు. నీవును హంతకుఁడవేయైనను, రాజశాసనమైనపిదపఁ గాని నిన్ను వధించుటకు వీలులేదు- కిరాతా! నీపనికానిమ్ము.

(కిరాతుఁడు కత్తినెత్తును.)

శంక—(కోపముతో) నిలుపుము. కిరాతుఁడా! నిలుపుము. ఓయుద్యోగీ! నిజమైనహంతకుని ఎదలి నిరపరాధులను వధించుటయా నీ న్యాయము? ఛీ! ఇట్టి యన్యాయబద్ధమైన శిక్షాస్మృతియేల? తగులఁబెట్టనా? నన్ను వధించుట కధికారము కావలెనంటివి! మంచిమాటయే! అంతవర కీవధను నిలిపివేయుము. రాజశాసనమిప్పుడే నీకు చేరఁగలదు. నామాట విశ్వసింపుము. న్యాయమును పాలించినవాఁడ వగుదువు.

జైలు—ఈహత్యను నిలుపుటకు నా కధికారములేదు.

శంక—లేదా? లేదా నీకధికారము? (ఏడ్చుచు) నాఅన్నపూర్ణ- సాధ్వీశిరోరత్నమగు నాయన్నపూర్ణ—అపరాధము నెఱుంగని నా యన్నపూర్ణ—అన్యాయముగ అతిఘోరముగ వధింపఁబడుటను పాపాత్ముఁడనగు నేను నాకన్నులతోఁ జూచి భరింపఁగలనా! ఇంక న్యాయమెక్కడ? అన్యాయమెక్కడ? న్యాయాన్యాయములను గురుతింపలేని గుడ్డిపందయగు న్యాయాధికారి యెవ్వఁడో వ్రాసినతీర్పు ననుసరించి యెఱిఁగియుండియు నీ వీ ఘోరకర్మము నాచరింతువా? కన్నులు లేవా నీకు? ద్రోహి

రెవ్వఁడో, హంతకుఁ డెవ్వఁడో గుఱుతింపలేవా ? నిరపరాధు
లను వధించుటకా ఈన్యాయాధికారములు, యీన్యాయపీఠ
ములు యేర్పడినవి ? అయ్యయ్యో ! అన్నపూర్ణా ! నాయన్న
పూర్ణా ! నీగొంతుకోయ సిద్ధమైన యీపాపిని రక్షించుటకేల
బలి యయ్యెదవు ? నాభాగ్యలక్ష్మీ ! నన్ను వదలిపోకుము.
నీయాయుర్దాయమునుఁ గూడ పోసికొని యీపాపాత్ముఁడిఁక
బ్రదుకలేఁడు. రమ్ము; రమ్ము. ఆపాపప్రదేశమునుండి క్రిందికి
రమ్ము; నన్ను చచ్చి శాశ్వతవిశ్రాంతి నందనిమ్ము. ఓన్యాయా
ధిపతీ ! న్యాయాధిపతీ ! చూచెదవేల నయ్యా ? ఇది నీకు పా
పమయ్యా ! సాధ్విని చంపుచుంటివిసుమా ! రత్నమును కాల
రాయుచుంటివి సుమా ! శిరీషపేశలకుసుమమును సన్నెకంట
నూరుచుంటివి సుమా ?.........ఓపాపాత్ముఁడా ! నామాట
వినవా ! అన్నపూర్ణహత్య నాపవా ! ఆపవా ! నాకన్న నీవే
ఘోరహంతకుఁడ వాదువుసుమా ! నామాట విను; విను. ఆ
పుము; హత్య నాపుము.

జైలు—వీలులేదు. కిరాతుఁడా ! ఇదే తుదియాజ్ఞ ! ఇంక నాలసించు
టకు వీలులేదు. కానిమ్ము.

(కిరాతుఁడు అన్నపూర్ణను వధించును.)

శంక—హా! అన్నపూర్ణా! (భూమిపైఁబడి నెత్తురు గ్రక్కిమరణించును.)

సంపూర్ణము.

# అనుబంధములు.



## (1) అన్నపూర్ణ.

నా । ప్రియవిభునినడత గనగా । మది వగపుగాన్పింప। నా॥
పరాశనునిగతి । సురాపానరతి । దురాత్ములగుహితులు వెన
గొన దిరుగు॥ నా।
ఇక నేమిసేతు । నెటువలెసైతుఁ । ఈమరంతంబగు నడతఁ కా
పాడగ నేవారలు । కాన్పింపరె । నాప్రాప్తికి॥ నా॥

## (2) డైలాగు.

ముఖారిరాగం—ఆదితాళం.

అన్న—నాధా నాతోడనీకేలు । వాదా కులకాంతలకు బాధాకరంబు
గాదా । అఅఅఅఅఅఅ। నా॥
మాన్యుండౌజనకుండు మరణింపఁగా । సుతైన నీమదిచింతనం
దవేల । పలుగాకులగు లోకు లిది విన్న నపకీర్తి॥ నా॥
శంక—మూఢమతివి నియుత్సాహ మొనరించితివే నసుఁ । నిను కను ।
లనుఁ గనఁజాలను । గృహమే నరకంబు॥ ఛీ॥
అన్న—.........—.........॥ నాధా॥

## (3) రాధాబాయి.

కాఫీ—రూపకం.

నేనుగదా । అప్టూడేట్ (up to date) । ఫ్యాషఁ (Fashion)
గలనారినీ ఫ్యాషఁగలనారినీ । ఆమకుల మితారినీ॥ నే॥
షోకులో । శోకులో । నాకెవరు సమానులూ॥ నే॥
ఫుల్మూఁ । లైటు (Full moon light) నాదువదనమూ ।

జాస్మైన్ । వైటు (Jasmine white) నాను సదనమూ । నను గని భ్రమ మునుగరే । ఘనులగు సురల్తైననూ॥ నేనుగదా॥

(4) డైలాగు.

బ్యాగ్ రాగం—రూపకం.

జయ—ఆహా రాధా సంపూర్ణసుధామోహిని । నిను వినా । సుదతి గనా । లోకమునా॥ అ॥

రాధా—నీకవిత్వమే । సుధాకరము ప్రణయభరముగా । మదికి మోదంబా నామనోనాధా॥

జయ—నాదుజీవనంబు నీదు । చరణముల కొసంగెదన్ । కమలవిమల నయనయుగము గనగ గనగ మోద మొదవుగా॥ అ।

(5) డైలాగు.

సురట—త్రిశగతి.

రాధా—నాను ప్రియునినోనాడకు । నాయనా । నటకుండగుట నటుల సలిపె । ప్రియమునా॥ నా॥

జయ—నిజమిదియే । నామదిగల దదియే । ఘటికుడ । నటకుండ । నగుకవి । నిది వినుమా ।

రాధా—లీలానటనంబున కీ । వేలా తామసమూనంగ । ఖేలనమే యిది నిజమని । చేలవై తలంతువా॥

గంగా—ఇదియే బహుమానము తులువా ।

జయ—కదలిచనెద వదలుము నన్ । క్రూరత నీకేతిబాధింపగ న్యాయమూ ।

గంగా—వెకలీ । యింకరాకుము నాసుతతో సరసంబులనాడన్ ।

రాధ—......॥నాదు॥

## (6) శంకరరావు.

భూప్—ఆదితాళము.

బ్రాందీసమానమైన । పానీయ మీాయిల గలదే॥ బ్రాం॥

పానీయ మీాయిలగలదే । పానీయ మీాయిలగలదే । ఫోర్సు (Force) చేరఁగ । ఫ్యాషను (Fashion) మీారగ। త్రాగి। ముదమేపారఁగ। షైరు(Shire)గావింతుగా । సితో । షైరు గావింతుగా వహ్వారే ! యపుడొదవెడు నా।యానందం బెన్నగ నగునా॥

(మాటలు)

పోరింగ్ సం సోడా యిం దీ గ్లాస్ (Pouring some soda in the.glass)
హ్యావింగ్ సం బరఫ్ త్రూదీడోస్ (Having some baraff through the dose)
అండ్ దెన్ డ్రింక్ పెగ్ బై పెగ్ (And then drink peg by peg)
హహ హహ హహ హహ హహ హహ। బ్రాందీ॥ (Ha Ha Ha Ha Ha Ha)

---

## (7) జానకి.

బ్యాగ్—ఆదితాళం.

వదరకుము పాపాత్ముడా । మాతోడా
వెలసతి జూడా । మధువశమున॥ వద॥

మాతను సోదరి నవమానించుచు । నే తనయులు నీకీతఁజరించిరి । పాతకుఁడవు కుల నాశకుండ వే। ప్రాప్తము గల్గునో పరికింపుము॥ వద॥

---

## (8) నాందీబాయి.

బ్యాగ్—ఏకతాళం.

మొగుడుముండాకొడుకు । మొదలారి చస్తే ।
పొగవేసి కాళికకు । పోతు బలియిస్తా॥ మొ॥
మొగము కొండాముచ్చు । ముక్కుపొడుమూా గచ్చు ।
కనబడ్డనావాళ్ళు । భగభగని రేచ్చూా ।
విరగడై పోతేను । కోరికలు పెంచ్చు॥ మొ॥

(9) ఝైలాగు.
ఖ్యాగ్—రూపకం.

నాందీ—ఓసీ చటకారీ నీ మదమణిగింతునే। నాభర్త। మహామా
ధాత్మ్యం జొగదా॥ ఓ॥

దాసీ—ఓసీ పిసినారీ నాపైనధికారములా। నాపసన్ జూపింతూ।
రోషం బడగింతున్ ।

ఇద్దఱు—ఇక తాళనూ। కనజాలనూ। కుక్కకాటుకూ। చెప్పుదెబ్బలే
కా। మందూ।

గంగా—వెరి వెల్। వెరి వెల్ : వెరి వెల్॥ (very well)

నాందీ—......॥ ఓసీ॥

---

(10) రాధాబాయి.
బీజ్‌ఫలాస్—ఆది.

ప్రేమసఖా। మోహనాకారా॥ ప్రే॥
మానినీ మానసానందచోరా॥ ప్రే॥
తావకీనమహిమా। దరణచే ప్రేమా।
లీననైతి విమలా। కారుణ్యసుధామా।
సంప్రీతిన్। ప్రేమింతు నిన్నున్। వినోదా।
ప్రమోదా। కామాబ్ధిదేల్ప రమ్మా। ప్రే॥

---

(11) అన్నపూర్ణ.
హిందూస్థానీముఖారి—ఆదితాళం.

హతవిధీ మాయామేమో। పతికి నాపై ప్రేమా। తీరెనా
సుఖసంప్రాప్తి చనెనా॥ హ॥
మధుపానమేనాడూ। మదిన్విడడేసతమూ। అధమవేశ్యాలోలు
డమ్యెనా। అయ్యయ్యో। సుఖసంప్రాప్తి చనెనా॥ హ॥

## (12) అన్నపూర్ణ.

కాఫీ—ఆది.

కరుణింపుమా । నానాయనా ॥క॥

నీసుతకే నేగానా ॥క॥

చరణముగడిగియు । శంకరునకు నను । పరిణయ మొనరిచి ।
మఱచితివే యది ॥క॥

---

## (13) అన్నపూర్ణ.

యమునా కళ్యాణి—ఆది.

ఓవాసుదేవా । శ్రీనివాసా ॥ఓ॥

దేవాదిదేవా । దివ్యప్రభావా ॥ఓ॥

హంతకుడగు నాయాత్మవిభునిపై । పంతగింపకుమా। పటుకృప
నేలుమా ॥ఓ॥

---

## (14) జైలాగు.

కాఫీ—దాదా.

శంక—అధరమధుర చుంబనం బహు ప్రమోదమూ । నీ । సుధామోహ
మానసం । బహులా వినోదమూ ॥అ॥

ప్రభా—నీసుందరంబూ । ప్రియబంధురంబుగా । ఆశదీర మోదమూ
ర । ననుభవించి । భువి సుఖింతుగా ॥అ॥

---

## (15) జైలాగు.

బ్యాగ్—ఆదితాళము.

మోహ—ఈగతి భయమేటికి మదిగొనెదవు । నా గురుభుజబల మె
ఱుంగవుగా॥ ఈ॥

కృష్ణ—ఓరి కుమారక మారువాడియున । నేమని నీమది దలచితివో॥

మోహ—వానితల చిదుకగొట్టెద మామా ।
కృష్ణ—వలదు వలదు విను విను మామా ।
మోహ—...ఈగతి॥

(16) జయరాం, కృష్ణమూర్తి.
కేదారం—జప్ తాల్.

పరమప్రియ మొదవుగా । హితు లిరుపురవము చేర॥ ప॥
ధరణి గంగారాము । తనయ భ్రమియింపఁగా । గురుతర కపట
లీల । గూర్చి మోసము సలుప । శంకరుని ధనము నా । శన
మంది చెడకుండ॥ ప॥

(17) డైలాగు.

శంక—మదనమోహనకర । వదనసుధాకర । సదయహృదయ గురు
తరవినయా । మదిని గుతుకమున । మదనకదనమున । మరులు
కొలిపితిని । గుణసదనా॥ మ॥
ప్రభా—సరసవచనరచనాంబుధి దేలిచి । సరస నిలువుమో । సుమ
బాణా । కరము కరముననను । కలిపి కుతుకమున । కరుణ బరపు
మా । నసచోరా॥ మ॥

(18) అన్నపూర్ణ.
ముఖారి—ఆది.

ఓ యనఘా । మనవిని వినుమిక నిటు । పలుకకో ప్రాణేశా॥ ఓ॥
వగలాడినిగూడి పయనమయి । తరలెద వంచును దెలిసెను
మాకో॥ య॥
అధికారభ । యము మీరఁగ । నరుదెంచితి వీపురికిఁ । పర
నారుల గూడగదలచెదు । హరి హరి యీపని । గురుతర క
లుషము ॥అ॥

## (19) జైలాగు.

బ్యాండు—ఆది.

శంక—పలుకులు పెడచెవి నిడెదవుగా। పలుమరు నను విడదలపవుగా॥

ముదమేపారగ। విలసిల్లెడి నన్ అపకీర్తికి పా। లొనరించెదుగా॥

పన్న—విడువనింక ధీరగుణా। అలఅల మనగజాలా। మానధనా।

అలఅ॥

శంక—......॥పలుకులు॥

---

## (20) నాందీబాయి.

అయ్యో అయ్యో। ఈబాలకునకు। అయ్య యెవడొకో।

నెయ్యమున నెవ్వారైనైన। నేర్పరింతునా ॥అ॥

---

## (21) శంకరరావు.

బ్యాగ్—ఆది.

హాయియా। గలిగించును యీసారాయియా। రుచిచూడుము

భాయియా ॥హా॥

మదిగల కలతల నిమిషములోపల। మరపింపగదగు హుషారి

నొసగుచు। మది బ్రహ్మానందము చేకూర్పగ। గలదిగా। నిమి

షమా। త్రంబుననె ॥హా॥

---

## (22) శంకరరావు.

(కసియాత్యజింపదాలా అను మట్టును పల్లవిమాత్ర మనుకరించును.)

ధనమే ప్రపంచలీలా। ఆహా ॥ధన॥

బలే। దానిమహిమ వర్ణింపజాలా ॥ధన॥

(సాకె) ధనహీనుం డవనిలో

(మిత్రిం) తృణసమానమగు నేచాలా। తృణసమాన మగునే॥ ధన॥

(మాటలు) వడ్డీలకు వడ్డీలు, బాకీలకు డిక్రీలు చేసి । కూడ । బెట్టి నట్టి సంచులాది । పైకమునకు

(రాగం) ప్రాణమునకు లంకె । అది । పోయిన పెనుకంకె ।
మోదకరీపైసా । ఆనందకరీ పైసా ।
పైసా । పైసా । పైసా । పైసా । పైసా ।
ఎంతో భ్రాంతిని గల్గించుని । పైసా పైసా పైసా !
దానిమహిమ వర్ణింపఁగఁజాలం॥ ధన॥

---

(23) శంకరరావు.

బ్యాంక్—జిల్లా.

(టీక) హాగుణశీలా । కరుణాహీనుఁడ । నను శపియింప వదేలా॥ హా॥

(త్రితాల్) ధర నీశాంతమె । దావానలమై । మరణింపకయే । మండించె సఖీ॥ హా॥

పాపమతిని మృతి । బాల్పడజేసిన పాపఫలమె నను । బాధించెసతీ॥ హా॥

సంపూర్ణము.

---